కామగ్రంథమాల:— నాలుగవ గ్రంథము.

# శృంగార పంచకము.



ఇందుగల గ్రంథములు.

జాబులు.
గ్రంథకర్త,
సెట్టి లక్ష్మీనరసింహం.

సరసోక్తియుక్త
కృష్ణ శతకము.
గ్రంథకర్త,
సెట్టి లక్ష్మీనరసింహం.

రసికాభిలాషము.
గ్రంథకర్త,
కవిసార్వభౌమ
శ్రీనాథుడు.

సరసచాటువులు.
గ్రంథకర్త,
సెట్టి లక్ష్మీనరసింహం.

పూర్వకవుల
చాటువులు.

1922





చందాదారులకు మాత్రమే
పోష్టుఖర్చులు సహా
వెల రు **1—4—0**

# భూమిక.

—:o:—

మ॥రా॥రా॥శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారిచే రచింపఁ బడిన 1 జాబులు — మొదటిభాగము. 2 జాబులు — రెండవ భాగము. 3 సతసోక్తియుక్త కృష్ణశతకము. 4 సరసచాటువులు. 5 కవిసార్వభౌమ శ్రీనాథకృత మగు—రసికాభిలాషము. ఇంక నితరకవుల చాటువులు. ఈ యైదింటి నిందు ముద్రించి శృంగారపంచక మని నామకరణ మొనర్చి 4 వ గ్రంథముగా వెలువరించితిమి. కావున మా చందాదారు లెల్లరు సాదరముగా నాదరింతు రని తలంచు చున్నారము. మాకు సర్వహక్కుల నొసంగి యీశృంగారపంచకమును మాచే వెలువరింపఁ జేసిన శ్రీ శ్రీ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి కెంతయుఁ గృతజ్ఞులము.

స్వవిషయము:— ఆంధ్రరతిరహస్యము కొఱకు చందాదారు లంద ఆత్రముతో వ్రాయు జాబు లందుకొను చున్నారము. రతిరహస్యమున మేము ప్రకటించిన యర్ధచాశీతి కాక మిగిలిన యర్ధ చాశీతి బొమ్మలు మా యశ్రద్ధవలన చెదపురుగుల పాలాయెను. కనుక సంభోగసమయమున నిజముగాఁ దీయ బడిన యన్యదేశీయుల ఛాయాపటముల నుండి చేయఁ బడిన చిత్రములతో నాంధ్ర రతిరహస్యమును వెలువరింపఁ దలఁచితిమి. ఇఁక నారుమాసములలో 5 వ గ్రంథముగా నాంధ్రరతిరహస్యమును వెలువరింపఁగల మని చందా దారులకుఁ దెల్పుకొను చున్నారము.

10—12—1922 }
పుదుచ్చేరి. }

ఇట్లు
యస్, చిన్నయ్య.

1

—◆ శ్రీ ర స్తు. ◆—




## మొదటి భాగము.

స్త్రీలకుఁ—బురుషులు.


[illegible]
తేలప్రోలు. (కృష్ణా జిల్లా)


గ్రంథకర్త.

సెట్టి లక్ష్మీనరసింహ్వాము.

—♦ శ్రీ ర స్తు. ♦—

# జా బి లు.

## మొ ద టి భా గ ము.



——○——

శ్రీమద్రమాకుమారస
తీమహితవిలాసవతిని ♦ దీర్ఘాయువుగా
ప్రేమంబున దీవించుచు,
ఆమీఁదటఁ బ్రియుఁడు వ్రాయు♦నది యేమనఁగా.

ఉ॥ ఏ నిముసంబునందు నిను ♦ నేఁ గనుఁగొంటినో యంత నుండి నా
మానస మన్యచింతలను ♦ మాని, య దేమి కతంబొ గాని, నీ
పై నె స్థిరంబుగా నిలిచి, ♦ పంతము పట్టిన యట్టిమాడ్కి నీ
ధ్యానము తప్ప వేఱు విష♦యంబులు తోఁపఁగ నీయ దో చెలీ! 2

చ॥ రమణుని నాల్కపై నొక ♦ సరస్వతిమాత్రమె సంతతంబు వా
సము నొనరించు నందు; రది: ♦ సత్యము కాదు; మదీయజిహ్వపై
రమణి చిరంతనంబుగ ని♦రంతరమున్ వసియింతు వీవు ధ్యా
నము జపమున్ ఫలించి, మఱి ♦ నాకు లభించుత నీదు పొందికన్

ఉ॥ ఇందిర యొత్తె తాను హృద♦యేశుని డెందము పాయ దన్న పే
రొందె నటంచు లోకు లను ♦ చుందురు; నీవును గాఁపురంబు నా
డెందము నందుఁ బెట్టి కద♦లింపవు కాలిని : నిన్ను నాదు భా
గ్యేందిర వందునో, స్మర జ♦యేందిర వందునొ? సుందరీమణీ! 4

చ॥ నగముశరీర మొక్కటె కొ♦నంగె, శిరంబునఁ దాల్చె నొక్కతెన్,
తగులము కల్గి యీశ్వరుఁడు ; ♦ తన్విరో, నేనును నీ నిమిత్తమై
నగ మయితిన్, భవచ్చరణ♦సారసమున్ శిర మందుఁ దాల్ప నుం
టిఁ గనుకఁ గైకొనంగదవె ♦ నీ హృదయేశ్వరుఁ గా గృపన్‌నన్ను౯

ఉ॥ కన్నులు వేయి యింద్రునకుఁ ♦ గల్గుట నిక్కమొ కాదొ గాని, వే
గన్నులు నేను బెట్టుకొని ♦ గౌతమనాతిని బోలు రూపసం
పన్నను నిన్నుఁ గందుఁ జుమిః ♦ భామిని నీ యెడ లెల్ల రాయి గా
కున్నను, నక్కటా! హృదయ ♦ మొక్కటిమాత్రము రాయియే
యగున్॥ 6

ఉ॥ చాలరు నీకుఁ గంతు దొర♦సానియు, మంతున కెక్కినట్టి యా
వేలుపుసానియున్, సరస♦విభ్రమరూపవిలాససంపదన్ః
లోలవిలోచనా, జగతి♦లో దొరసానులు సాను లెల్ల నీ
కాలిని గల్గు గోళ్ల కెన♦గా రిఁకఁ జక్కనిచుక్కలైననున్॥ 7

—♦ ( గొలుసు సీసము. ) ♦—

సీ॥ ఔ బళా! యో యబ♦లా నీ కులుకులు! రూ
పునను గోపునను నిన్ ♦ బోలరు నర
లోకమున కలుకు♦లును, వేలుపుఁ జిలుక
లకొలుకులు; నహాబ♦ళా! మదనుప
దను ములుకు లగుఁ గ♦దా నీ కనుబెళుకు
లు? బళిబళీ! నీ జ♦లిబిలిపలుకు
లు? పులకండపలుకు♦లు; బళి! నీ మెయి తళు
కులు తొలి మెఱపుల♦కుం గరపుఁ గ

తే॥ గీ॥ ళుకులు; మొగము వెన్నెలలఁ జి♦లుకును; పెదవి
నుండి యొదవి, మధు వొలుకు♦ను; పృథివిని నె
లకుర లసితకాంతులతో స♦లుకును; ముంగు
రు లళికులమునకు సమకూ♦రుచు నళుకును॥ 8

ఉ॥ నమ్మ సుమాస్త్రి నానగ ఘు•నమ్మసుమా నెఱివేణి; మేను నూ
నమ్మసుమా; ముఖమ్మ నలి•నమ్మసుమా; చిఱునవ్వ నవ్యఫే
నమ్మసుమా, మెఱుంగు రత•నమ్మసుమా యధరమ్ము; చూపు మీ
నమ్మసుమా మృగాక్షి గగ•నమ్మసుమా నునుగౌను నీ కహా!॥

ఉ॥ చిల్వలరాయ డూడిగము • చేయఁగ వచ్చును నీదు వేణికిన్:
కల్వలవిందు నీ మొగము • కన్గొని వంతనె జో హుకమ్మనున్;
కొల్వొనరించు నీదు తళు•కుంగనుదోయికి గండుమీలు: నీ
చెల్వము నెన్న నల్వకును • చిల్వలతేనికి నౌనె చెల్వరో॥ 10

ఉ॥ కోకిలకాకలీధ్వనుల•కున్ గురుపీఠము నీదుకంఠఁ మిం
తీ, కలహంససంతతికి • నీ గమనం బుపదేశకర్త; నీ
యాకృతి మేనకాదిలలి•తాంగులకున్ బడిపెద్ద: యద్దిరా!
నీ కడనేకదా యొరులు • నేర్పులు తీర్పులు నేర్చుకోవలెన్॥

సీ॥ కడుపునఁ గన్నట్టి • గారాబుబిడ్డలు
మొలకతుమ్మెదలు నీ • ముంగురులకు;
దరిఁ జేరి తుళ్ళెడి • దగ్గఱచుట్టాలు
గండుబేడిసలు నీ • కన్నుఁ గవకు;
చెవిలోన మంతనాల్ • చెప్పునేస్తంబులు
పదరుకోయిలలు నీ • పలుకులకును;
అడుగుల మడుగులొ•త్తెడి పనికత్తెలు
చిగురుగుత్తులు నీదు • చేతులకును:

ఆ॥ వె॥ ఒదిగి మెదిగి తిరుగు • చున్నట్టి యాశ్రితు
లంచగములు నీదు • యానములకు;
జాతిబందుగులు ప•సందైనజాజులు
కలుకులాడి, నీదు • పలువరుసకు॥ 13

ఉ॥ చాన, సువర్ణదానమును ♦ సల్పును నీదు శరీరకాంతి; భూ
దానము సల్పు నీ కటి; స♦దా తిలదానము సల్పు నాస; యా
రా! నిరతాన్నదాన మమ♦రాళికి సల్పును నీదు మోవియున్,
నే నిను నీవి వేఁడితిని ♦ నీ విఁక లే దనఁ బో కొసంగుమా॥ 17

చ॥ రజమును దాల్చు పుష్పని♦కరంబును, చెమ్మను బూను పల్లవ
వ్రజమును, తేజముం గల సు♦వర్ణము, గాలికి నూఁగు తీఁగ,ల
భ్రజనితమైన క్రొమ్మెఱుఁగు ♦ పంక్తియు నీ తను వందుఁ గూర్చి, ని
న్నజుఁ డిటు పంచభూతనిచ♦యంబునఁ దా సృజియించెఁ గోమలీ॥

ఉ॥ తేనె యనంటిపండ్లఁ గల ♦ తీయఁదనం బల దొండపండ్లలోఁ
గానఁగ వచ్చు నేని, యటు♦గాక యనంట్లకు దొండపండ్ల కెం
పైనను గల్గె నేని, సరి ♦ యా ననవచ్చును నీదు మోవికిఁ:
మానిని! నీ బెడంగు లస♦మానములై విలసిల్లు సృష్టిలో॥ 19

ఉ॥ తామరతూండ్లటంచును, ల♦తాయుగ మంచును, బువ్వుదండలం,
చీ మెయి నీదు బాహువుల ♦ నెన్నుదు రన్నివిధాల నందఱుం:
కాముఁడు వీడ కుండ నను ♦ గట్టిగఁ గట్టిన మోహపాశము
ల్గా మది నేఁ దలంచెదను ♦ గామిని! గంధగజేంద్రగామినీ॥ 20

చ॥ ఇల పయి నీదు కౌను గుఱి♦యించి వివాదము లుద్భవిల్లఁగా,
కల దని, మింటికిం బయిని ♦ గ్రాలు నటంచును గొంద ఱాస్తికుల్
పలుకుదు రద్ది కేవల మ♦బద్ధ; మొకింతయుఁ గాను నీవుఁ దొ
య్యలి, నహి, లేదు, లే దనుచు ♦ నాస్తికవాదము నేను సల్పెదన్॥

చ॥ మదనునిదంతి వోటకు స♦మంబుగ నీ నడ లేన్గునెన్నడల్
గద; తొడ లేన్గుతుండములె, ♦ గండరుచుల్ కరిదంతతుల్యముల్
గద; మఱి యొక్కసామ్యమును ♦ గద్దది చెప్పితి నేని, నీవు సి
గ్గొదవు నటంచు జంకు మెయి♦ నూరక యుందుఁ జకోరలోచనా॥

ఉ॥ లేతగులాబిఱేఁకుల వ♦లెం జెలు వాఱును నీ కపోలముల్;
వాతెఱ జాతికెంపనఁగ ♦ వచ్చును; సంపెఁగ నాస; చంద్రిలో
పాతిక వెన్నెసల్; కనులు ♦ పద్మదళంబులు; శ్రీలు కర్ణముల్;
నాతి, భవన్ముఖంబు నలి♦నంబులవైరియె యెల్ల రీతులన్॥ 13

శా॥ పట్టాకత్తియె సుమ్ము నీదుజడ; యా♦పై కన్బొమల్ విండ్లె; యు
ట్టిట్టుం బఱ్వెడి చూపు లమ్ములె: యయా♦రే! నీ యొయారంబులే
కొట్టన్ వచ్చిన యట్టి మాడ్కిఁగను నా♦కుం జూడఁ జూడంగఁ జూ
పట్టెన్; నిన్ శరణంటి నన్ గరుణఁ జే♦పట్టంగదే యంగనా॥ 14

సీ॥ గిరగిర నీదు ముం♦గురుల సుళ్లం బడి,
మరలలేకుండె నా ♦ మానసంబు;
బిరబిర నీదు బి♦త్తరపుఁ జూపుందూపు
గుములు నాఁటెను నాదు ♦ గుండె యందు;
గరగర లాడు నీ ♦ ఖరుసుపయ్యెదవల
లోఁ జిక్కుపడియె నా ♦ లోచనములు;
జరజర నీదు కే♦శంబులం దొరఁగు చీఁ
కటి నాకు కామాంధ♦గార మయ్యెఁ;

గీ॥ పరపరన్ గుత్తుకను గోయు ♦ కిరుసుకత్తి
యాచు నీదు క్రీజ్జడ నాకుఁ ♦ దోఁచు చుండె;
చుఱచుఱన్ వెన్నె లట్లు నీ ♦ చిఱునగవును
సోఁకు చుండె నా మేని కో ♦ సుందరాంగి॥ 15

చ॥ దిరిసెనపూవె చూవె భవ♦దీయశరీరము; నీదు నేత్రముల్
విరిసిన కల్వపువ్వు; లర♦విందము నీ వదనంబు; మల్లెపూ
వరుసను బోలుఁ బల్వరున; ♦ వాతెఱ మంకెన; పువ్వుఁబోఁడి, నీ
దరిసెన మబ్బు మున్ను సుమ♦ధన్వుని బువ్వులఁ బూజ చేసినన్॥

సీ॥ చక్రిసామ్యంబు నీ ♦ జఘనప్రదేశ మొ
క్కటికె కా, దింక రెం♦డిటికిఁ గలదు;
దాడిమీజయము నీ దంతవితాన మొ
క్కటికె కా, దింక రెం♦డిటికిఁ గలదు;
కరులతో వాదు నీ ♦ గమనవిలాస మొ
క్కటికె కా, దింక రెం♦డిటికి గలదు;
బింబరూపంబు నీ ♦ పెదవి చక్కఁదన మొ
క్కటికె కా, దింక రెం♦డిటికిఁ గలదు;

గీ॥ తరుణి, సంఖ్యచే రెండని ♦ ద్వైతముగను
చెప్పుటే గాని, సరిగ చ♦ర్చించి చూచు
వారి కెల్ల నభేదభా♦వంబు తోఁచు
చుంట నద్వైతముగఁ జెప్పు ♦ టుచితమే మొ॥ 23

శా॥ నాణెం బౌ రతనాలదుద్దులును, సొ♦న్నాటంకపుం బేరు, వి
న్నాణం బౌ పుదుచేరిచేఁత జిగినీ♦నానున్ సువర్ణంపు టొ
డ్డాణంబున్, రక మైన నాగరము మే♦ల్వంకీలునున్, కంకణాల్
రాణింపన్ మరురాణివాస మన నా ♦ రాణీ, విరాజిల్లవే?॥ 24

ఉ॥ కామిని, పచ్చపట్టురవి♦కన్ బిగి గట్ట ధరించి, మేలి బా
లామణిచీరఁ దాలిచి, త♦ళత్తళ లాడెడి దుద్దు లాదిగా
హేమవిభూషణప్రతతు ♦ లెన్నియొ మేనునఁ బూని నట్టి నీ
గోము తలంచుచున్ మఱవు ♦ గొందుఁగదే యితరప్రపంచమున్

శా॥ జాకెట్టున్ జలతారుచీరయును భూ♦షల్ దాల్చి, దోషాకరున్
చేకొట్టం గల మోముతో వెలయు నీ ♦ చెల్వంబు వీక్షించినన్
వాక ట్టాఁ గద యెట్టివారికిని? చె♦ల్వా, విల్వకే యిత్తువో,
తాక ట్టుంతువొ? నీ మనంబు తెళ మొం♦దం జేయుమా నాకిఁకన్

చ॥ విపులము గాఁగ కుచ్చెళులు ♦ వీచుల మచ్చున తోఁచుచుండ పైఁ
టపరికిణీని కట్టుకొని, ♦ దగ్గఁ అపింజలు కల్గి పట్టిప
స్షపు తెలిపైకయుం దొడిగి, ♦ నాకెపు గుమ్మట మట్లు నీవు నా
కెపుడును దోఁచు చుందువు గ♦దే జకదేకవిలాసినీమణీ॥ 27

ఉ॥ జాలుగ కేశముల్ ముడిచి ♦ చక్కని దొక్క గులాబిపువ్వు పైఁ
జేరిచి, బాగుగా చలువ ♦ వేసిన తెల్లనిచీర కట్టి, క
బ్బాయివికఁ ధరించి, మెయి ♦ భాగపుసొమ్ములు లేని సొదు సిం
గారము కన్నవారలను ♦ కన్నులపండుగ కన్నెమిన్నరో॥ 28

చ॥ వదులుగ నల్లి పట్టెజడ, ♦ వంగ మొగంబున మూఁగుముంగురుల్
నుదుటి సిలాయిచుక్కయు, క♦నుఁగవ కాటుక రేఖ, సన్న నై
పొదలెడి తెల్లపుట్టమును ♦ పుక్కిటిపిడిచుచేత నెఱ్ఱ నా
పెదవియు, నీకు పెట్టియును ♦ బెట్టనిసొమ్ములు కావె కొమ్మరో॥

ఉ॥ బాపురె! నీ మొగంబునకు ♦ పౌడరు చల్లుట యేల? సబ్బుతో
రాపిడి యేల మేని? కఫ♦రంబుకసం దములంపుఁ గెంజిగిం
దోఁపఁగఁ జేయ నేల? కను♦దోయికి కాటుక యేటి? కోపడం
తీ, పునరుక్తిదోషమున ♦ కివ్వి యుదాహరణంబు లౌఁ జుమీ॥ 30

చ॥ దిటముగ నల్లి పక్షిముగ ♦ దీర్చిన కీల్జడ యొక్కమాఱు, వ్రేల్
జట యొకమాఱు, గుత్తమగు♦జార్ముడి యింకొకమాఱు, మేలిము
చ్చటముడియొక్కమాఱు, కను ♦ చక్కనియొస్సిగ యొక్కమాఱుగా
కుటిలకచా, భవత్కచము ♦ గూర్తువు నా మది చిక్కు పొందఁగన్॥

చ॥ విరి యని మల్లెమొగ్గ లొక ♦ వేళను, పీడిన యట్టిసంపెఁగల్
మఱి యొకవేళ, చక్కని గు♦లాబులు వేఱొకవేళ, గేదఁగుల్
మఱి యొకవేళ గాఁగ కుసు♦మంబులు వేణిని దాల్చి పువ్వుబోఁ
డిరో, పువ్వువిల్తునారసము ♦ శేవను నాఁటెదు నామనంబునన్॥ 32

చ॥ సగము శరీరముం దలుపు ♦ చాటున దాఁచి, సగంబు వీధిలోఁ
గగపడు నట్లుగా నహర ♦ హంబును నిల్చిన యట్టి నిన్ను ర
క్తిగఁ గను చుండుటన్ భ్రమర ♦ కీటకనీతిని నా శరీరముం
ముగుద సగంబె యయ్యెఁ బరి ♦ పూర్ణ కృపం గనిపింపుమాయికన్

ఉ॥ పేశలవాణి, స్నాన మయి ♦ పెన్నెఱులం దడి యార్చి మేడపై
కేశచయంబు చిక్కు దొలఁ ♦ గించుచు నీవు పచారు చేయుచోఁ,
రాశిగ నున్న మబ్బులఁ దొ ♦ రంగు శశాంకుని బోలు నీ మొగం
బాశ మదీయదృక్కు వల ♦ యంబులకుం గలిగించు టబ్రమే?॥ 84

శా॥ జాబా మీఁదను సందెచీఁకటితతుల్ ♦ డా బొప్పఁగా నీవు ము
న్నాపై చల్లనిగాలి కై తిరుగఁగా, ♦ స్వర్లోక మం దుండి రం
భాబింబోష్ఠియె యేగుదెంచె నని వి ♦ భ్రాంతిం దలంతుంగదే!
యో బాలా, నినుఁ గోర కుండెడి శుకం ♦ డుర్వీస్థలిం గల్గునే?॥

ఉ॥ అద్దము ముందు పెట్టుకొని ♦ యందముగాఁ గను నీవు పాపటన్
దిద్దుచు నుండఁగా, తెర వ ♦ దే యని చొచ్చిన నాదు చూపులోఁ
ముద్దియ, రెండు చెంపలపు ♦ మూఁగి, నొసంటిన సాఁగి, చెక్కులన్
గొద్దిగ నాఁగి, మోముపయిఁ ♦ గుబ్రమ్మర సాగెను జాపలంబునన్॥

ఉ॥ గానకళా విశారదవు ♦ గావున చల్లనివేళ, ముందు హా
ర్మోనియ మీవు పెట్టుకొని ♦ మోహనగాత్రిరో, జంత్రగాత్రముల్
వీచుల కొక్క రీతి విని ♦ పింపఁగఁ బాడిన పాటచేతి నా
మానస మందు కోర్కె లను ♦ మాఱు చిగిర్చి: ఫలించు టెన్నఁడో

ఉ॥ బాలిక స్నానముం సలిపి, ♦ పట్టుదుకూలము కట్టి, నీవు దే
వాలయ సీమ చేర, నుప ♦ వాసముచే వసివాడి ముచ్చటం
జాలఁగఁ గొల్పు నీ మొగము ♦ చందము కన్గొని మోహమొంది, యా
వేళను నీదుపొందు నొద ♦ వింపు మటంచును దేవుఁ గొల్చితిన్॥ 88

ఉ॥ చేతను బుస్తకంబులను ♦ జేకొని మెల్లగఁ బాఠశాలకై
యో తరళాక్షి, నీ వరుగు♦చున్నెడ, మన్మథబాధచేత నా
చేతము వ్రీలుచుండ, నినుఁ ♦ జీమయుఁ గుట్టినయట్లు కాదయో!
భూతదయాగుణం బెదను ♦ బుట్టని నీ చదు వేలఁ జెప్పుమా?॥ 39

చ॥ నెలఁత, కొళాయి కీ వరిగి ♦ నీళ్లను బట్టుచు నిల్చి యుండఁగా,
బొక్కబొళ మంచు గొట్టమున ♦ బుట్టిన నీళ్లు నీదు బిందెలో
పలఁ బడినట్టి రీతి నుతి♦పాత్రిమ వౌ నినుఁ జూచి నా మన
స్థలిని ద్రవించుకోరికలు ♦ ధారను గట్టి స్రవించె నీపయిన్॥ 40

ఉ॥ జోటిరో, మొన్న నాటకము♦చూచుటకై చనుదెంచి, యచ్చటన్
బోటులలోన నిన్నుఁ గని ♦ బుద్ధి మరల్పఁగ లేనివాఁడనై,
నాటక మేమియో యెఱుఁగ; ♦ నాయకి! వీ వగు చిత్రనాటకం
బాటగ మన్మథుండు నను ♦ నాడఁగఁ జేసెను సూత్రధారుఁడై॥

ఉ॥ సంబర మీవు చూచుటకు ♦ చక్కనివేషముతో డ బండిలో
సం బయి కాస్యమించుగ క♦నంబడు నట్లుగ వంగి యున్నచో,
శంబరనేత్రి, నేత్రములు ♦ సాచ్చగ విప్పుచు నిన్నుఁ జూచుటే
సంబరమయ్యె నాకు: పయి ♦ సంబర మంతయు వ్యర్థమే సుమీ॥

శా॥ బొట్లం జెప్పఁగ భూషితాంగి వగుచుం ♦ బుష్పేల్తు పట్టింపుటే
నగ్గీ వేగుచు నుండ, దీపపువెలుం♦గందున్ నినున్ గాంచి, యీఁ
కట్టన్ నీ మెఱుఁగారునవ్వలె తోలం♦గం జేసెనో, లేక గా
స్లైల్లమూలకుఁ దోసెనో, యెఱుఁగ కా♦శ్చర్యంబు కంటింజెలీ॥

ఉ॥ బందుగులింటి పెండ్లి కయి♦ బాలనీవును నేనుఁ [illegible]యం
దండఱుఁ బెండ్లిపందిళుల ♦ యందు మునింగి మెలంగఁగా, నదే
సందడి యంచు నంటి మది♦జ్ఞాపక మున్నదో లేదొ? నాఁటియా
నందము నిన్ను నేఁ గలిసి♦నంగద క్రిమ్మరఁ గల్గగా వలెన్?॥ 44

చ॥ చిలుకలు పెల్లుగాఁగ రొద • సేయఁ, బికంబులు కూయ, షట్పదం
బులు కడు మ్రోయఁ దీవగమి • పూయఁగఁ బూవులు తావులీయ నీ
గలిసి విహారముల్ సుమన • సంబుల సల్పఁగ నేర నేని, తో
య్యలి, మఱి యీవసంతము ని • రర్థకమే ఋతురాజమయ్యునున్

ఉ॥ ఆతపతాప మొక్క దెస, • నంగజతాప మి కొక్క దిక్కునన్
నా తను వేర్చు చున్న యవి • నాతిరో, గంధపులేఁతపూఁతలన్
శీతల మైన నీ, యెదను • జేరిచి తాపముఁ బాప కున్న, నే
రీతిగ నాతరం బగును • గ్రీష్మదినంబుల నెల్ల దాఁటఁగన్?॥ 46

చ॥ జలదము మూసి పెట్టి దివ • సంబుల రాత్రులఁ జేయు చుండ, లో
పలియడు గించు కేనియును • పై కిడ నీయని వాన జోరుగా
ఇలఁ బడు చుండ, వెచ్చఁదన • మిచ్చెడి యింటను రేపవల్లు నీ
గలిసి సుఖింపఁగా మదిని • గాంక్ష జనించెను గామినీమణీ॥ 47

ఉ॥ నీరదపంక్తి లేమిని వి • నిర్మల మౌ గగనస్థలంబునన్
శారదపూర్ణచంద్రముఁడు • చల్లెడి చల్లని చంద్రికల్ భవత్
స్మేరముచే నిరర్థకత • చెందుచు నుండఁగ, నిన్నుఁ గూడి యిం
పార శుభాంగి, వెన్నెల • బయళ్ల సుఖించుట యుంద్రభోగమే॥

ఉ॥ ఇంతయు సందు లేక బిగి • యించిన గాటపు కౌఁగిలింతలన్
సంతిస మీవు నా కొసఁగ • సమ్మతిలన్ వలె నట్లు కానివో,
కాంతరో, మంచుచే వడఁకు • గల్గగ చేసెడి దీర్ఘ మైన హే
మంతపురాత్రులం గడప • మార్గము లేదు మ ఱేది యేనియున్॥

చ॥ కుటిలశిరోజ, దట్టమగు • పెంకు మచన్నలచేత రక్తముల్
దిటముగఁ బూని నట్టి భవ • దీయకుచద్వితయంబు సొమ్ముకుం
పటులన ధాన కట్టుకొన, • మానసనా యీ శిశిరంబునందు హృ
త్పుటమున నుండిపుట్టు చలి • పోవునె యిం కెటుపాట్లు పడ్డనున్?॥

ఉ॥ వీధినిబోవ తెప్పలను ♦ వేయక నన్ గనుఁగొంచెగాని, నా
బాధయెఱింగి నీదు మది♦భావము తెల్పఁ దలంపవేమి? శ్రీ
నాథుని ద్రావిడాంగనల♦నైజము చూపక, యేది యేనియున్
సాధనమున్ వచింపఁ గదె ♦ సారసలోచన, గూఢకేళికిన్॥ 51

ఉ॥ ఇష్టము నీకుఁ గల్గి నటు ♦ లించుక యేనియు నీవు నాకు వి
స్పష్టము చేయ కున్న యెడ, ♦ బాకులు కత్తులు నైన సుమంబులే
కష్టముపెట్టు నా మదిని ♦ కామిని, నీదు కటాక్ష మున్నచో,
ముష్టిశరంబులన్ మరుఁడు ♦ మూలకు పాఱఁగవైవఁగా వలెన్॥

ఉ॥ ఏర్పడఁ జేయ కుంటివిగ♦దే భవదీయమనంబు: నీదు ని
ట్టూర్పులు, పైఁటజార్పులునొ♦కొక్కపుడాశనుగొల్పు; నంతటన్
మార్పులు నీ ప్రవర్తనము♦నం గనుపట్టి నిరాశ పుట్టు: నే
నోర్పు వహింప, దర్పకుఁ డిఁ♦కోర్పు వహించునె దర్పహీనుఁడై?॥

చ॥ అడిగిన యంత నెప్పుకొను ♦ నట్టులె కన్పడి, వేఁడి నంత ని
య్యెడఁ గడు బెట్టు సర్తు వహ!♦ యియ్యది తొయ్యలి నీకె కాదు, మీ
పడఁతుక జాతికంతకు స్వ♦భావము: భావ మెఱింగి నిన్ను నే
విడువక యుంటి; నేలుకొన♦వే, యిటు బెట్టొనరింప నేటికే?॥ 54

చ॥ అభిమత మున్న యట్టు లొక♦యప్పుడు, లేనటులొక్కయప్పుడో
యిభగమనా, కనంబడెద ♦ వేటికె? కాంతలచిత్తముల్ జగత్
ప్రభుఁడె యెఱుంగఁగా వలయు ♦ తావకచిత్తము తెల్పకుంట, బె
ట్టో, భయమొ? యిట్లు చంపఁగనె♦టుల్ మనుదున్ మనసిచ్చియేలవే॥

ఉ॥ నోటను నాకు తావకమ♦నోవిధముం దెలుపంగ సిగ్గు మో
మోటము కల్గెనేని, మను♦ముల్ కనుసైఁగలు లేవె? లేవె వ్రేల్
మీటులు? మందహాసములు ♦ లేవె? యవేవియు చేఁతగానిచో,
చీటులు లేవె? పంపుటకు ♦ చేటులు లేరె? యుపేక్ష యేటికే?॥ 56

ఉ॥ సిగ్గును గొంకునుం గలుగు ♦ చేడియ లుండరె? వారు నీవలెన్
దగ్గఱ కింత చేరఁగనె ♦ దాఁగఁగ తుఱ్ఱున పాఱిపోదురే?
ఇగ్గతి యిప్పుడైన, మఱి ♦ యెట్లుగ కౌఁగిట నుండ నేర్తువో?
దగ్గిన నూడు ముక్కు వని♦తా, యెటు తుమ్మిన నిల్వ నేరుచున్?॥

ఉ॥ సిగ్గునఁ గొంకు చుంటివొకొ? ♦ చిన్నవయస్సును జేసి వెన్కకున్
తగ్గుచు నుంటివో? చతుర♦తన్, మఱియున్ మురిపించు చుంటివో
మొగ్గును జూపుచుంటివొకొ?♦ముద్దియ, మత్కృతమైన దెద్దియో
యెగ్గు ఘటిల్లెనో? దయ వ♦హింపుము; దోసిలి యొగ్గి వేఁడితిన్॥

ఉ॥ గుట్టును నేను దాఁచ నని ♦ కొంకుచు నుంటివొ? యట్టులైన, నే
నొట్టును బెట్టుకొందు విను♦మో చెలి: నామది కాముఁ డమ్ములన్
గట్టిగ త్రివ్వి చూఁచినను ♦ గన్పడ కుండెడి లోతు నందు నేఁ
బెట్టి, భవత్స్వరూపమును ♦ బ్రీతిని గాచెద దైవసాక్షిగన్॥ 59

మ॥ నెలఁతా, కాళ్లరుగంగ నేఁ దిరిగితిన్; ♦ నిల్వంబడంగా, నదే
నిలు చుంటిం జుమి సిల్వబత్తెముగ; నే ♦ నిద్రింపనే లేదు రా
త్రుల యందు; దిట్లుగ నాశ్రయించినను,నా♦తోఁ బల్కనుం బల్క: విం
డలిబాధన్ సగమేని పడ్డ మెటులన్, ♦ స్వర్గంబె సాధింపనో॥ 60

ఉ॥ రోజున కొక్కరీతిని స♦రోజముఖీ, చరియించు చుందు: వ
వ్యాజకృపావిశేషము నొ♦కప్పుడు చూపెద; వొక్కయప్పు డే
దో జగడంబు పెట్టుకొని ♦ రొమ్ముదకు నైనను జేర నీయు: వ
న్నా! జవరాండ్రచిత్తగతు ల♦న్న, క్షణక్షణముల్ నిజంబుగన్॥

ఉ॥ సమ్మతి నీకు లే దని ని♦జమ్ముగఁ దోఁచిన, లే దటంచు స్ప
ష్టమ్ముగఁ జెప్ప కుండ ననుఁ ♦ జంపఁగ నేటికి? చెప్పి నంత, ప్రే
మ మ్మొదవింపఁగాఁ గలుగు ♦ మందులు మాంత్రికులు నెల్లఁ దెచ్చి వ
శ్య మ్మొనరించుకొందు వన♦జాస్య, యవశ్యముగాఁగ నిన్నిఁకన్

శా॥ అంగీకారము లేనిచోఁ దెలుపరా ◆ దా? పామునున్ చావకుం
డంగాఁ, గఱ్ఱయు సైతమున్ విఱుగకుం ◆ డంగా, నిదేలా? ప్రసూ
నాంగీ, నీ నిరపేక్ష తెల్పఁగనె, ని ◆ న్నర్థించుకష్టంబు నా
కుం, గోపంబును జూపుకష్ట మిఁక నీ ◆ కుం, గల్గకుండుం గదా?॥

ఉ॥ దూతికతోడ నీకడకు ◆ దొయ్యలి, నేఁ గబురంప, దానికిన్
బూతులు తిట్టి తోలితఁట! ◆ బుద్ధివిహీనతయే, మఱోర్తుతో
ఈ తెఱఁగా రహస్యమును ◆ నేను వచించుట; తప్పువచ్చె నేఁ
జేతులు మోడ్చి మ్రొక్కితిని; ◆ జేసినదోసము సైఁచి యేలుమా

శా॥ సంకేతస్థలి కేను ముందుచని, యో ◆ చానా, "ఇఁకన్ వత్తువో,
ఇంకే వత్తువొ?" యంచు కాఁచుకొని, నీ ◆ వెన్నంటికిన్ రామి "ఆ
టంకం బేదియొ కల్గి మానితివొ, యి ◆ ష్టం బుండమిన్ రావొ?" యన్
శంకం బొందితి; మామ కాశలు నిరా ◆ శల్ చేయ న్యాయం బఁకే

ఉ॥ రాతిరి రాఁగ పొద్దుటను ◆ రమ్మని, పొద్దుట రాఁగ నింక నే
దోతటి రమ్మటంచు, నిటు ◆ లోతరుణీమణి, నన్నుఁ ద్రిప్పుట
నీతి యఁటే? యదో యొకటి ◆ నిర్ణయ మా సమయంబు తెల్పినన్
చేతులు నేను గట్టుకొని ◆ చేరనె, యెట్టి యకాల మైననున్?॥ 66

ఉ॥ కోకలు కోరెదో, నగలు ◆ కోరెదొ, కానుక లేవి కోరెదో,
రూకలు కోరెదో, చెలియ ◆ రో, తెలియంగను జేయ కీవు న
న్నీకరణిన్ శ్రమం బఱచె ◆ దేమిటికే? పులిజున్ను నేనియున్
లోకము లెల్లఁ జూచి త్రుటి ◆ లోఁ గొనివచ్చెద నీవు కోరినన్॥ 67

మ॥ ఉవిదా, యక్కర తీఱు నంతవఱ కే ◆ వో యచ్చికల్ బుచ్చికల్
చెవి కిష్టంబుగఁ బల్కి, యా వెనుక నిన్ ◆ చేరంగ నే రానొ య
న్నవిచారంబును బెట్టుకో వలదు; మే ◆ నం బ్రాణ మున్నన్ని నా
ళ్లు విధేయుండను నీకు: నా వలపు నేం ◆ డ్లుం బూండ్లు తగ్గించునే?॥

ఉ॥ మక్కువ నీకు క ద్దనిన ♦ మాత్రముచేతనె లాభ మేమి? నా
యక్కర దానఁదీఱ నఁటె? ♦యక్కట! నీ విదు ముద్దు లబ్బెనో?
అక్కున నిన్నుఁ జేర్చుకొను ♦ టబ్బెనొ? నీ మధురాధరోష్ఠముల్
నొక్కుట యబ్బెనో? మఱి మ♦నోహరి, వట్టిప్రియం బిదేటికే?॥

ఉ॥ వారికి నీరికం దెలియ ♦ వచ్చు నటంచును జంకు చున్న, నో
నీరజనేత్రి, యెన్నఁటికి ♦ నేనియుఁ గార్యము సానుకూల మా
నే? రమణీజనంబులకు ♦ నిందుగ సాహస ముందు నందు: రే
దారియొ చూపి, నాదు సర♦దా కొర దాపడ కుండఁ దీర్చుమా॥

శా॥ పాతివ్రత్యము కల్గు దాని వలెనే ♦ భాషించుచున్ నిష్ఠులన్
నీతుల్ పల్కిన, ముద్దరాల వనుచున్ ♦ని న్నందురే? యెన్ని యో
చేతల్ చూచిన జాణవం చెఱుఁగనా? ♦ చెల్వా, యిదే రీతిగా
చాతుర్యంబులు చూప కేలుకొనవే ♦ సంప్రీతిచేతస్క వై ॥71

చ॥ మగఁడు మనంబు నందు నను♦మానము పొందెను గాన నన్నురాఁ
దగ దని వార్త పంపితివి: ♦ తప్పుకొనన్ మిష గాని, నిశ్చయం
బుగ మదిలోన నీవు వల♦పుం గలదావవ యేని, భర్త క
న్నుఁగవను గప్ప నేరవె మ♦నోహరి, యింతటిజాణ వయ్యునున్?॥

శా॥ గోడల్ గొందులు దాఁటి, జంకుమఱి కొం♦కున్ లేక, కన్గోయికె
వ్వాఁ డింపై కనిపించినన్ సరియె య♦వ్వానిన్ యథేచ్ఛన్ రతి
క్రీడం దేల్చిన ప్రోడ వీ వని ధరి♦త్రిన్ నీదు విఖ్యాతి వి
న్నాఁడన్: నేఁడు ననున్ వరింతు వని యు♦న్నాఁడన్ వువుంబోఁడిరో

ఉ॥ చెప్పెద నింటివారి కని ♦ చీటికి నన్ బెదరించె దేల? యే
తప్పును మోపి చెప్పెదవు? ♦ తావకరూపము చూడఁ గూడదో?
యొప్పుమటంచు వేఁడఁ దగ♦దో? యటుచెప్పెదు గాని, ముందుగా
త్రిప్పులు పెట్ట కేలుముగ♦దే జగదేకవిలాసినీ, ననున్॥ 74

చ॥ అతివరో, యింటఁ దెల్పెదన♦టంచును నన్ బెదరింపఁబోకు; నీ
వు తెలుప, నేను మాన; తగ♦వున్ విను వారలె తీర్త్రి గాక; యి
ట్లు తొలుత నాశ పెట్టితివొ;♦లోఁకువ యైతి నటంచు నెట్లు నా
హితమును దీర్ప మానితివొ, ♦ యీ సకలంబును బైకి చాటెదన్

శా॥ పాపం బీవని యంచు సన్నిపుడు చే♦పట్టంగ రా వేల? నీ
కే పాపం బయి, నాకు కాదె? నరకం♦బీ వొంద, నే నొందుదుం;
దాపం బచ్చటఁ బొందఁగా వలయు న♦న్నం, దాప మిచ్చోట లే
దే? పూఁబోఁడి, భయంబు పో విడిచి, న♦న్నేలంగదే సత్కృపన్

ఉ॥ పాప మటంచు నన్నుఁ బరి♦పాలన చేయుట కొప్ప వేల? తా
రాపతి నేలి నట్టి గురు♦రామకుఁ గల్గని యట్టిపాపమున్,
గోపకుమారు గోపికలు ♦ కూడఁగఁగల్గని యట్టి పాప మో
సీ పువుఁబోఁడి, నీకొక తె♦కేయిపు డబ్బునె యబ్బురంబుగన్? 77

మ॥ అతివా, అంగన నమ్మరా, దనెడి ప♦ద్యం బెన్నడో మున్ను చి
న్నతనం బందు పఠించినాఁడను; ననున్ ♦ నమ్మించి నమ్మించి, యి
ట్లు తుదన్ నీ వొనరించు మోస మిపు డా♦లోకించుచున్, దానికిన్-
స్తుతికా,-దక్షర లక్ష లీయఁ దగు నం♦చున్ నేఁడు నే నెంచితిన్॥

చ॥ నెలఁతరో, కన్నెపాయమున ♦ నీవు మదంకము నెక్కి, నీదు చం
కల గిలిగింత గొల్పుచును, ♦ కాయము నెల్ల స్పృశించి బుగ్గ ము
ద్దులు గొనుచున్, "ననున్ వలచి♦తో వగలాఁడి?" యటన్న నవ్వి, "నా
వలపుల కాంత," నంటె; వల♦ వాక్యము నిక్కము సేయుమిప్పుడన్

ఉ॥ ఈడుకు నీవు వత్తువన, ♦ నింటను గల్గినవారు నిన్నుఁ గా
పాడుచు చేడియా, బయట ♦ పాదము పెట్టఁగ నీనివేళ, నిన్
చూడఁగ నేను బద్ధశ్రమ ♦ చూచితి వేనియు, నిప్పుడైన నా
వేడుక తీర్పకుండుదువె ♦ వేపురు కాఁపుగ కూరుచుండినన్?॥ 80

ఉ॥ ఎన్నఁటికింక నీ వెదిగి ♦ యీడుకు వత్తువొ యన్న వాంఛతో
కన్నుల నీదు సౌష్ఠవ మెఁ♦గాదిగఁ జూచుచు వత్సరంబులే
నెన్నుచు నుండ, నిప్పటికి ♦ నీవు రజస్వలవైతి: వింక నో
కన్నె యుపేక్ష మాని వడి♦గా మదపేక్షను దీర్చి ప్రోవుమా॥ 81

ఉ॥ సుందరి, పెద్దదాన వయి ♦ శోభిలుకాలము నందు నొంటిగా
సందు లభించి నంత, కను♦సైఁగలు, నవ్వులు, మేనిరాపులున్
దొందరపాటుముద్దులును ♦ దొంగతనంబుగ మార్చుకొన్న యా
చందము నీ కొకించుకయు ♦ జ్ఞప్తిని లే నటులుంటి వియ్యెడన్॥

చ॥ ఇఱుకు గ లట్టిదారి మన ♦మిద్దఱ మొంటిగ తారసిల్లఁగా,
చిఱునగ వొప్ప నీ భుజము♦చే ననుఁ జెచ్చెరఁ ద్రోసికొంచు నీ
వరిగిన నాఁటిచందమును ♦ నందము నెందము నందు నాటులన్
మఱవక యున్న వాఁడనుసు♦మా కుసుమాంగి సుమాస్త్రు నానగన్

ఉ॥ అంటెనొ నీకు నూత్నముగ ♦ నచ్చట నేదియొ భాగ్య? మత్తవా
రింటికిఁ బోయి వచ్చిన యి♦టీవల బాల్యపునేస్తకాని నన్
గంటను జూడ వైతివి; ము♦ఖాముఖి యైన, మొగంబు వాల్చుకొం
చుంటివి: బాల్యకాలపుప్రి♦యుల్ కనిపింతురె భర్త వచ్చినన్?॥

చ॥ పొరుగున కీవు వచ్చుటను ♦ బుణ్యము పండెను నా కటంచు సం
బరపడు చుండ, నన్నుఁ గనఁ ♦ బైకనిరా; వొకవేళ వచ్చినన్,
శిరమును నెత్త; వెత్తినను, ♦ జేసిన సైఁగకు మాఱు చేయ: వీ
విరుగునఁ జేరి నట్టిఫల ♦ మేకనిపింపక యున్న దోచెలీ॥ 85

సీ॥ బొట్టు పెట్టమి మచ్చ ♦ కట్ట నుండఁగఁ దేట
యై ముచ్చటం గొల్పు ♦ మోముతోడ,
నగలు క్రిందను మీఁద ♦ దిగవేసికొనమి న
ల్పొందక జిగి గల్గు ♦ నొడలితోడ

నూనె వాడుకను మానుటం జేసి జిడ్డును
బోరయక యున్న పెన్నెఱులతోడ
రవిక లేమిం దెలిచీరను స్పష్టమౌ నటు
కనిపించు మేనిపొంకంబుతోడ
గీ॥ తరుణి, యిప్పటి బాలవితంతురూప
మే! వెనుక కంటె నెక్కువహితము కొల్పె:
భర్త కంటెను, నీ కుపభర్త నొచు
నెక్కువ హితంబు కూర్తు నే నింకమీఁద॥ 86

మ॥ విధవాత్వంబున కీవు చింతిలకుమీ వీరేశలింగంబుగా
రు ధరన్ మీకొఱకే జనించి రలవారున్ దారిఁ జూపింప కు
న్న, ధృతిన్ మానఁగఁ బోకు; నీకు దయ యున్నం జాలునో బాలికా
వృథగా నీ యెలప్రాయముం గడవఁగా నీయం జుమీ యెన్నఁడున్

ఉ॥ బొట్టును బెట్టుకోఁ దగిన పుణ్యము పోయె నటంచుఁ గుందకే;
ఇట్టులు లేఁతప్రాయమున స్వేచ్ఛ లభించుట భాగ్యమే గదా?
ఎట్టి విధంపులోప ముదయింపని యట్లుగ, నీకు బొట్టునుం
బెట్టి ప్రియంబునం బిలుతుఁ బ్రేయసి, రాఁ గదె నాదుప్రక్కకున్

సీ॥ ముంగురుల్ నొసటిపై ముసరితుంపెసలాడఁ
గను నీవు నాట్యమాడిన విధంబు
వీనులం దేనెల సోనలం గురిపించు
చును నీవు పాట పాడిన విధంబు
కరకంకణముల నిక్వణ మనుక్షణము గ
ల్లనఁగ నీ వభినయించిన ప్రకారంబు
తూపుల రూపున తూఁకి హృదయముల్
కలఁగించు నీదు కన్నుల మెఱుంగు

గీ॥ మేఘముల తోడి వారకా♦మినులతోడఁ
గూడి నీ వున్న యట్టి యం♦గును గనుంగొ
నంగనె యనంగుఁ డేచఁ గ♦డంగె: నంగ
నామణీ నీ మఱుంగు నొం♦దంగ నిమ్మ॥ 89

శా॥ కొక్కోకంబును నేర్చి,వాక్కులును ట♦క్కుల్ పెక్కుగా నేర్చివే
ఱొక్క త్తె వ్వతె నీకు సాటియగు నో♦హో!వేశ్యలం దేనియున్?
రొక్కం బెం తయినన్ సరే యొసఁగెదన్♦ రోచేదరో, న న్నిఁకన్
చొక్కింపంగదె, నేర్పు:లెన్నికలవో♦ చూపించుచున్ మక్కువన్

ఉ॥ కాంతలె మాయకత్తె లనఁ♦గా వెలకాంతలు మాయకత్తె లం
చింతిరొ, వేఱె చెప్పవలె♦నే? యిది స్పష్టముగా నెఱింగియుం,
స్వాంతము నందు నిన్ వలచి ♦ వచ్చితి: తక్కిన వేశ్య లట్లె కా
వింతువొ, నమ్మకంబు నొద♦వింతువొ యీ పయిఁ జూడఁగా వలెన్

మ॥ మగవారల్ వశ మౌట కెల్ల గణికల్♦మందుల్ ప్రయోగింతు రం
ట!గుణం బిచ్చునటంచు నాకెవియొ పె♦ట్టం బోదు వేమోసుమీ;
వగలాఁడీ యటు పెట్ట కున్నపుడె యో♦ర్వన్ రాని యీబాళి నిం
డెఁ గదా? పెట్టిన, మన్మథుం డసువు లే♦నిన్ నిల్వఁగా నిచ్చునే?

సీ॥ చవి చూచితినె కాని ♦ చాన, నీ యధరసు
ధల్ పల్మొనలు గుచ్చి ♦ త్రావ నైతి;
ఆనించితినె కాని ♦ యతివ, చెక్కుట మోవి
ననుకొన్నరీతి ము ♦ ద్దాడ నైతి;
స్పృశియించితినె కాని ♦ చెలి, నీ యురోజముల్
గట్టిగా పలుమారు ♦ పట్ట నైతి;
తగిలించితినె కాని ♦ తరుణి, మేన్ మేను న
ల్లిక గొనఁగాఁ గౌఁగి♦లింప నైతి;

గీ॥ మచ్చు చూచితినే కాని ♦ మగువ, ప్రథమ
నిధువనం బాటఁ దృష్టి జ♦నింపఁగా ర
మింప నైతిని: గాన నే ♦ యింపుమీఱు పు
నస్సమాగమంబునకు నిం♦తగఁ దపింతు॥ 93

ఉ॥ కౌఁగిట నిన్నుఁ జేర్చుకొనఁ ♦ గల్గెడి భోగము నింద్రభోగముం
గా గణుతింతు; నెంత నినుఁ ♦ గౌఁగిటఁ జేర్చినఁ దృప్తి, కల్గ లే;
దో గజరాజయాన! యిఁక ♦ నొక్కపరిన్, మఱియొక్కమాఱు, త
ద్భోగము నేను బొందఁ దలఁ♦తున్ విసువుం గన కట్లొసంగుమా

ఉ॥ కాముకవృత్తి మై రకర♦కంబుల భామలతోడ నేస్త మో
కామిని, మున్ను సల్పితిని ♦ గాని, యొకర్తుక యేని నేర్పునన్,
గోమున, నిన్నుఁ బోలఁ గల♦కోమలి కన్పడ లేదు: నే నిఁకన్
కాముని సాక్షిగాఁగ, నినుఁ♦గాక మఱొక్కతె నొల్ల నెన్నఁడున్

ఉ॥ ఓ ఫణిరాజవేణి, మన ♦ మొండొరు మోములు చూచుకొన్న వే
ళాఫలమో, మఱేమియొ? బ♦ళా! నినుఁ గన్నులఁ గన్న దాదిగా
సాఫుగ నన్యకామినుల ♦ సంగతికిన్ మన సొగ్గ దాయె: ద్వి
రేఫము వేఱుపువ్వులఁ జ♦రించునె, నీరజమే లభించినన్?॥ 96

చ॥ జలజదళాయతాక్షి సర♦సంబునకుం బొలయల్క యుండఁగా
వలయు నటంచు నల్గితివొ? ♦ వ్యర్థపుఁ గోపము తెచ్చుకొంచు, నీ
వులుకక పల్కకీకరణి ♦ యూరక యుండుట నీతి కాదు: నన్
పిలిచి, యథాప్రకారముగఁ ♦ బ్రేమను గౌఁగిటఁ జేర్చుకోఁ గదే॥

ఉ॥ ఇంకొక కామినిన్ మరగి ♦ యిప్పుడు పోవుచు నుంటి నంచు నో
పంకజనేత్ర! పట్టి యప♦వాదము నాపయి మోఁపె దేల? యి
ట్టింకులు గొన్న మోహమున ♦ నిప్పుడె కా, దిఁక నెప్పుడున్ భవత్
కింకరుఁడన్: మఱింకఁ దొలఁ♦గించుకొనం గదె నీదు శంకలన్॥ 98

శా॥ ఏ యాటంకము లెన్ని కల్గినను ని♦న్నే నేను, న న్నీవు కాం
తా! యిన్నాళ్లును నాశ్రయించుకొని యు♦న్నా; మింతో
యంతో సుఖం
బే యెల్లప్పుడుఁ బొందినారముగదా? ♦ యిట్లున్న యన్నాళ్లునుఁ
హాయిం గూర్పఁగ నిన్ను వేఁడుకొనెదఁ; ♦ దైవంబుఁ
ప్రార్థించెదఁ॥ 99

సీ॥ మంగళం బగుఁ గాక ♦ మానినీ తారకా
సఖము లౌ తావక♦నఖములకును !
మంగళం బగుఁ గాక ♦ మగువ, చక్రప్రతి
బింబ మౌ నీదు ని♦తంబమునకు !
మంగళం బగుఁ గాక ♦ మహిళామణీ, కోక
రాజము లౌ నీ యు♦రోజములకు !
మంగళం బగుఁ గాక ♦ మదిరాక్షి, శశికళా
సదన మౌ భవదీయ♦వదనమునకు !

గీ॥ మధువు క్రోవి యౌ మోవికి ♦ మంగళంబు !
మల్లెపువ్వు లగు నవ్వులకు ♦ మంగళంబు !
మరులు గను లగు కనులకు ♦ మంగళంబు !
మధుకరు లగు ముంగురులకు ♦ మంగళంబు! ॥

ప్రథమ భాగము సంపూర్ణము.

———o———

—♦ శ్రీరస్తు. ♦—




రెండవ భాగము

పురుషులకు—స్త్రీలు.

గ్రంథకర్త.

సెట్టి లక్ష్మీనరసింహము.

25

4

శ్రీ ర స్తు.

# జాబులు.

## రెండవ భాగము



శ్రీనందనసమసుందరుఁ
డైన మనోహరునకుఁ బ్రియు◆రా లనురాగం
బూని కవుంగిట గాఢము
గా నణఁచుచు మ్రొక్కి, చేయఁ ◆గల విన్నపముల్

ఉ॥ కంటికి నింపు గాఁగ నినుఁ ◆ గన్నది యాదిగ కామబాధచేఁ
గంటస మయ్యె నా బ్రదుకు; ◆ కంటికి నిద్దుర రాక యుండె; ఆ
కంటికి నన్ను మైనఁ దినఁ◆గా వెగ టయ్యెను: నిన్నుఁ గానమిన్
గంట యుగంబు కై వడిని ◆ గన్పడు చున్నది ప్రాణనాయకా॥ 2

చ॥ అల దిన ముందు నా సమయ◆మం, దల చోటున, నీటుగోటు, లిం
పులు పలుసొంపు, లందమును ◆ బో ల్పగు చందము, షోకుశీకు, లే
పులు బలుకోపులుం గల య◆పూర్వపు నీ చెలువంబు చూచి, నా
తలఁపులు నీ పయిన్ నిలిచె; ◆ తప్ప వయో! యెటు త్రిప్పుకొన్ననున్॥

సీ॥ లేఁత వెన్నెలను బో◆లిన చిఱునవ్వుతో
మురియుచు నున్న నీ ◆ ముద్దుమొగము,
కర్ణరంధ్రము లడ్డు◆గా రాఁగ నిల్చిన
గతిఁ బొల్చు చున్న నీ ◆ కన్నుదోయి,

వలరాజు పూర్తిగా ♦ వంచిన విండ్ల వై
ఖరిఁ జెలువారు నీ ♦ కన్నుబొమలు,
మోవితేనియ మీఁద ♦ ముసరు తుమ్మెద లట్లు
మిసమిస లాడు నీ ♦ మీసములును,

గీ॥ నీ వెడఁదఱొమ్ము మఱియు నీ ♦ నిడుదభుజయు
గమ్మ నీ నడల్, నీ యొడల్ ♦ గాంచి మది వ
రించి, తపియించు చుంటి నో ♦ ప్రియుఁడ యెట్లు
గతిగఁ బ్రోతువో? యిఁక నాదు ♦ గతివి నీవె॥ 4

ఉ॥ చక్కఁదనంబునన్ సరిగ ♦ సంపెఁగ మొగ్గయు, తమ్మిపువ్వు, నీ
ముక్కు, మొగంబు: వానిఁగని ♦ మోహముఁ బొందితి; నాదుప్రాణముల్
దక్కక యుండ, సంపెఁగలుఁ ♦ దామరలున్ మదనుండు నా పయిం
గ్రక్కున వేయ సాగె: ననుఁ ♦ గావుము నీ మరు గిచ్చి నాయకా॥

ఉ॥ సంపెఁగమొగ్గతో తగవు ♦ సల్పెడి ముక్కును, మల్లెమొగ్గలన్
చెంపల గొట్టు పల్వరుస, ♦ సింగములన్ బెదరించు మధ్యమున్,
కెంపును నీరసం బనుచు ♦ గేలి యొనర్చెడి మోవి గల్గి, నీ
వింపు ఘటింతు వోయి హృద ♦ యేశ్వర, నా కనుదోయి కెప్పుడున్

ఉ॥ తుమ్మెదఱెక్కతోడ తులఁ ♦ దూగఁగ జాలెడు నీదుమీసమున్;
తమ్ముల నేలు నీ కనులు, ♦ తల్పును బోలె వెడంద యైన నీ
ఱొమ్మును గాంచి, మోహము నె ♦ ఱుంగని నా మది యిప్పు డక్కటా
కుమ్మరిసారె లోపల త ♦ గుల్గొని నట్లుగ నాయె నాయకా॥

ఉ॥ నా పెనుమోహ మంతయుఁ గ ♦ నంబడు నట్లుగ మాటిమాటికిం
జూపులఁ దెల్పుచుంటి; ననుఁ ♦ జూచుచు నవ్వుచు నుంటి వీవునున్:
నా పయి కూర్మి పుట్టి యటు ♦ నవ్వితివో, యటుగాక నాదు సం
తాపము గాంచి వేల నని ♦ నవ్వితివో, యెఱుఁగన్ మనోహరా॥ 8

చ॥ సరిగను, మోడి గాఁగ, సర♦సంబుగ, తేలిక గాఁగ, నోరగా
చుఱుకుగ, నన్నుఁ జూతు: వల ♦ చూపులభాషను నే నెఱుంగ;వల
తెఱవక, యించుకే తెఱచి ♦ లేఁతగ, పూర్ణము గాఁగ విప్పి సుం
దరముగ నవ్వు చుందు: వల ♦ నవ్వులభాషను నాకు నేర్పరా॥ 9

శా॥ నీ వెవ్వండవు, నే నెవర్తె? నహహా! ♦ నీమీఁద నీమాడ్కి నా
భావం బేటికి నిల్వ, కల్వవిరికిన్ ♦ పద్మారిపై రీతి? యా
పూవుంబోలిక దూరవుంజెలిమియే ♦ పొందఁగ నా కబ్బునో?
నీవున్ నేనును బూవుఁదావియు బలెన్ ♦ నెయ్యంబు మై నుందుమో?

చ॥ ఒకరికి మెచ్చు గొల్పు సొగ, ♦ సొక్కరికంటికి నచ్చదోయి నా
యక భవదీయరూపము మ♦దక్షులకుం బ్రియ మైన యట్టి పో
లికగనె, నాదు రూపమున ♦ లేని విలాసము లేని నీదు కం
టికిఁ గనిపించుత, స్మరుఁడు ♦ నేర్పుమెయిన్ ఘటియించు మాయచే!

ఉ॥ ఒక్కొక కాంత కొక్కక ప్రి♦యుంగను నంతకు లోకమంతయున్
నిక్కముగా నెడారివలె♦ నే కనుపట్టును; కన్న దాదియున్
చక్కని నందనోపవని ♦ చందమునం గనుపట్టు: నీవు నా
దృక్కుల పడ్డ యంతటనె, ♦ దిక్కులు పుష్పమయంబు లయ్యెరా

ఉ॥ ఓ రమణుండ, స్త్రీపురుషు ♦ లొండొరులన్ సమవాంఛ నేలఁగాఁ
బో "రది జన్మనాసనయె ♦ పో," యని పెద్దలు పల్కలేదె? తా
గోరిన పూరుషుండు తనుఁ ♦ గోరుటకంటెను భాగ్య మున్నె? నిన్
గోరితి: నీవు నాకు నను♦కూలుఁడ వౌదువా, లేదా? యకటా!

చ॥ వల పెవ లేని యట్టి మగ♦వానిపయిన్ మన సుంచి, వానితోఁ
గలయఁగఁ గోరుకంటె నర♦కం బిఁక స్త్రీలకు వేఱె కల్గునే?
తెలియని సేఁపయిన్ నిలిపి♦తిన్ మది: నీపయి నీదు చిత్తమో
చెలువుఁడ నాదుభాగ్య; మిదె ♦ చేతులు మోడ్చితి:యేలుమా నన్న్

మ॥ వలపుం దాతురు గాని, పూరుషులతో ♦ వా యెత్తి స్పష్టంబుగం
దెలుపం జూడరు స్త్రీలు: నాదువలపున్ ♦ నే నాఁపుకో లేక, ల
జ్జిల కుండన్ వెలిఁ బెట్టుకొంటి ననుచున్ ♦ సి గ్గయ్యె; నెమ్మోము నిం
కిలలోఁ జూపఁగ లేను: దాఁచుకొనని ♦ మ్మా నాథ నీ గుండెపై॥

ఉ॥ కన్యనో యన్యకామినినో ♦ కా వలె నంచుఁ దలంకఁ బోక, సా
మాన్యగ నెంచి ప్రాపకము ♦ మాట తలంపుము; నిన్నుఁ దక్క నే
నన్యుల కంట నైన నగ ♦ యన్; ♦ రతివేళనె వేశ్య నాచు నిన్
ధన్యునిగా నొనర్తుఁ, గుల ♦ నారు లెఱుంగని యట్టినేర్పుతో॥ 16

మ॥ నినుఁ జూడన్ వలె నంచు, వీ లయినచో ♦ నీతోడ సంభాషణం
బు నొనర్పన్ వలె నంచు, వాకిటనె తే ♦ పున్ మాపు నేఁ గాఁపురం
బొనరింపం దొరకొంటి; మోహమున నో ♦ హో! సాహసం బెక్కువా
యెను: నేనే చనుదెంచి, పైఁ బడెదఁ జు ♦ మ్మీ నీవు రా కుండినన్॥

ఉ॥ నిన్నుఁ గనంగ, నా మనసు ♦ నిక్కముగా సెగ పొంత వెన్నయౌ:
"వెన్న వలెం గరంగు నలి ♦ వేణుల కౌఁగిటఁ జేర్చుటే సుఖం,"
బన్న వరూధినీ వచన ♦ మారసి, నన్ వరియింపు; మట్లు గా
కున్నను, నా మన స్సుడుకు ♦ నో నవమన్మథ, మన్మథాగ్నిచే॥ 18

మ॥ మగరాజా, బిగు వేల? బ్రహ్మ భవదా ♦ త్మం జేసెనా యేమి ఱా
యిగ? నేనే మగవాఁడ నై, మఱియు నీ ♦ వే కాంత వై, నా పయిన్
మిగులన్ మోహముచేతఁ గ్రాఁగుచును నీ ♦ మే నన్నచో, నూరక క్షీ
పగిదిన్ బెట్టొనరించి నీ యుసురులన్ ♦ బాలాటకుం జూతునే?॥

ఉ॥ నమ్మక మైనదాన ప్రియ ♦ నాయక, నా హృదయంబు నీకు నే
నమ్మెద రమ్మ నీ దయకు; ♦ నయ్యది చాల ప్రియం బటంచు బే
రమ్మును బెట్టి నీవు కొన ♦ రం దొడఁగన్, పయిపెచ్చుగా మదం
గమ్మ నొసంగెదన్ వదలఁ ♦ గా వల దింతటి చౌకబేరమున్॥ 20

చ॥ అవసర ముండి నేఁ బలుకు ♦ మన్నను బల్కవు, పంచదార చి
ల్కవఁటర? నిశ్చయం బగు శు♦కంబుగ నా భుజపంజరంబునన్
వివిధవినోదవాక్కులను ♦ వీనుల విందుగఁ బల్కుచున్ వసిం
తు వనిన, నీకు నా పెదవి♦దొండను తిండిగఁ బెట్టెదం బ్రియా॥

చ॥ వనిత దనంతఁ దా వలచి♦వచ్చినఁ జుల్కన యంచు, నన్నుఁ జు
ల్కనగను జూడఁ బోకుముర; ♦ కా దని చుల్కగఁ జూడ నెంచుకొ
న్నను, పురుషాయితంబులను ♦ నా మెయిభారము గాఁగ నుండఁ బో
దని యయినన్ ననుం గలయ♦రా వలరాయనికేళి నాయకా॥

చ॥ మగఁడన కంటికింపగుచు♦మక్కువ గొల్పు నతండె యంచు ము
న్నగవును దెల్పెఁ దార; యల ♦ తారకుఁ జంద్రుఁడువోలె నీవు నా
మగఁడవు త్రాఁడులేని యను♦మానము తీఱఁగ, బాహుపాశముల్
బిగువుగ నా గళంబునను ♦ బ్రేమను గట్టఁగదోయి నాయకా॥

సీ॥ ముద్దాడెదను రార ♦ మోహనాకార నన్
ముద్దాడ నీకు మో♦మోట మైన;
పెదవి నొక్కెద రార ♦ ప్రియనాయకా నాదు
పెదవి నొక్కుట నీకు ♦ బిడియ మైన,
కౌఁగిలించెద రార ♦ కామినీమార నన్
కౌఁగిలించుట నీకు ♦ కష్ట మైన,
సరస మాడెద రార ♦ సరసుఁడా, నాతోడ
సరస మాడుట నీకు ♦ శంక మైన;

గీ॥ కటకటా! నోట వ్రేల్ వెట్ట ♦ కఱవ లేని
కరణి నున్నావు గాని, మొం♦డఱపెదవుల
గఱచి నట్టి భుజంగశి♦ఖామణి వొకో!
ఎట్టి పుట్టులో, నేపామొ ♦ యెవరి కెఱుక?॥ 30

శా॥ నీ సౌందర్యము కాంచి యాశ పడితిన్ ♦ నీ చిత్త మేతీరొ? నీ
మీసం బట్టుప్రసన్న మై తనరు నో? ♦ యా రీతిగాఁ గాక, నీ
మీసం బట్టులు వక్రిమో యెఱుఁగ; నీ ♦ మీసాలలో నవ్వులన్
నా సందేహము వృద్ధి చేసె; నది మా♦న్పం జిత్త మిమ్మా ప్రియా॥

ఉ॥ నాయక, నీవు నన్ వలచి♦నాఁడ వటంచును నాకుఁ దెల్పఁగా
నే, యొడ లెల్ల జల్లు మని♦యెన్, వలిగాలికి తీవ కైవడిన్;
కాయము దాల్చి నందులకుఁ ♦ గల్గె నదృష్టము నేఁటి; కింక నా
ప్రాయము ధన్య మయ్యె: నిటు♦పై మఱి యే దెటులైన నున్ సరే॥

ఉ॥ ఎన్నఁడు నీకు మోహముద♦యించునొ నాకయినంచు నుండఁగా
ఇన్నిదినాల కద్ది లభి♦యించెను కాంతలప్రాయ మన్ననో
క్రొన్ననవంటి దోయి 'యిది♦గో' యన నాఱునెలల్ గతింప కుం
డ, న్నను ధన్యురాలిఁగ నొ♦నర్పఁగ రాఁ గదవోయి నాయకా॥

ఉ॥ కోకలు గోర, రూకలును ♦ గోరను; సొమ్ములుఁ బెట్టఁ గోర, నే
శోకముగోర నీ కరుణ ♦ సోఁకుటయే పదివేలు నాకు; నీ
రాకనె కోరు చుండెదను ♦ రాకను జెందొవ గోరుమాడ్కి— న
ప్రాకలు నన్ను బెట్టకుము♦రా, కలకాలము నేలరా కృపన్॥ 28

చ॥ తనప్రియుఁ గూడకుండ వసు♦ధం గులకాంతకు నత్తయంచు,మా
మని, మఱి యాఁడుబిడ్డలని ♦ యిష్టులు గంగకు నొష్టులట్లుగా
కని కని నాదు కాఁపురము ♦ గంగను దింప తెగింపు పుట్టె; గం
గను శివుఁ డేలుకొన్నటులు♦గా నను నేలెద వన్నవో ప్రియా॥ 29

చ॥ పురుషవరేణ్య! స్వాతి కయి ♦ ముత్తెపుఁజిప్పల రీతి నా కనుల్
త్వరపడు చుండె తావకవి♦లాసము కన్గొన స్వాతిబిందువుల్
కురిసినఁ గాని ముత్తియపు ♦ కోవ జనింపదు శుక్తు లందు; ని
న్నరయనికాల మందె యుద♦యం బగు నా కనులందు ముత్యముల్

మ॥ నిదుర న్మాని మెఱుంగుగా నలికితిన్ ♦ నీ వచ్చుదారుల్ పదిం
బది నా కాటుకకన్నులం బఱపి; ర♦మ్మా, నాకు కన్పండుగా;
ఎదురుం జూచుచు నుంటి 'ఇ ల్లలుకఁ గా♦నే పండుగా?' యంచు న
వ్వెద వేమో? యొకయిల్లె గా, కలికితిన్ ♦ వీథిన్, మఱిన్వాడయున్॥

ఉ॥ పొందులు మంత్రముల్, వలెనె ♦ మామకచిత్తము మెత్తఁ జేయ నీ
సుందరమందహాసములె ♦ చొక్కఁగఁ జేసెడి మందు లౌ; భవ
చ్ఛందనశీతలోక్తులె ము♦దం బిడు మంత్రము లౌనుఁ డెందమా
నందముఁ బొంద నన్ కలిసి ♦ నవ్వుచు కేరుచు నుండరా ప్రియా॥

చ॥ రమణుఁడ, నాదు మానసస♦రస్సుదరిన్ వలరాజు నీదు మీ
స మనెడి మేలిగాలపుకొ♦సన్ నునుమోవిమెఱం దగిల్చి నే
ర్పుమెయిని వేట లాడఁగను, ♦ మోస మెఱుంగని దై మదాత్మ మ
త్స్యమకటా! యందుఁ జిక్కువడి ♦ య ట్టిటు కొట్టుకొనంగఁ జొచ్చెరా॥

శా॥ నాకున్ నీకును గొంత యున్న దని నా♦నారీతులం బేరులన్
లోకుల్ వెట్టిరి: వాదు రాఁ దగిన దే♦ట్లున్ వచ్చె; పో వెన్నఁడున్
కాకుల్ లోకు లనంగఁ బోకు, జనవా♦క్యంబు బద్ధి కర్తవ్యమే:
కైకొమ్మా ప్రియకాంత గాఁగ నను నే♦కాంతంబునం గాంతుఁడా

ఉ॥ రోసము కల్గినట్టు లతి♦రూక్షముగాఁ గను నన్నుఁ జూచుచున్,
మీసము ద్రిప్పె దేమిటికి? ♦ మేటిమగండవె యైన జంకులే
కో సుకుమార, ర; మ్మ తను♦యుద్ధము నందు పెనంగి చూత: మా
యాస మటంచు ముం దెవర ♦ మందుమొ వారలె యోడినట్లగున్

ఉ॥ వ్యాకుల మేల? వల్లభ, ప♦రాంగనఁ గూడినఁ బాపమంచు తా
టాకుల లోన వ్రాసి రని♦యా? యల వ్రాత లెటున్న, నేమిరా?
నీకును నాకు బ్రహ్మ మును ♦ నిక్కముగాఁగను వ్రాసి యుంచె: నే
పోకలఁ బోయినన్ జరుగుఁ ♦ బో తుద కాతనివ్రాత రీతిగన్॥

ఉ॥ వాసన చూడ నట్టి ప్రస♦వంబు న టంచును గొప్ప లేల? వి
న్నామ్మ, సరసాళులన్ వలపు♦నం దనియించినదాన; నీవునున్
వాసిగ నెన్నిపూవులనొ ♦ వ్రాలినతేఁటివి యాటచేత, ప
దీ? సరసుండ, నా పెదవి♦తేనెరుచుల్ చవి చూచి చెప్పుమా॥

మ॥ అనురాంగ బెద నీకు నా వయిని లే ♦ ద న్నట్టి లోపంపు మా
టను బల్కంగను బోకు: కుంకుమముతో♦డం గూడి వాసించు చం
దనపుంబూఁతల నెట్టు నై న యురముం ♦ దాఁకించి నిన్ కౌఁగిలిం
తును బ్రాణేశ్వర, దాన నీ హృదయ మం♦దున్ ర క్తికల్గుం జుమీ॥

శా॥ ఆకాంక్షన్ నిను నేఁ గదున్ వలచి ని♦ద్రాహారముల్ మానుటం
జేకూరెన్ శివరాత్రిజాగరణసం♦సేవాఫలంబున్, విశు
ద్ధైకాదశ్యుపవాసపుణ్యఫలముం: ♦ బ్రాణేశ, కైలాసమున్
వైకుంఠంబును గాఁగ నీ కవుఁగిలిన్ ♦ వాంఛించి నేఁ గాంచెదన్॥

చ॥ ముడుపులు గట్టుకొంటి, మఱి♦మ్రొక్కులు మ్రొక్కితి, దేవుఁడెవ్వఁడొ
క్కఁడుఁ గనఁబడ్డ నీ చెలిమి ♦ కల్గఁగఁ గోరి; లభింప దాయెః నా
ముడుపులు నీకె కైకొనుము, ♦ మ్రొక్కులుఁ గైకొనుః మీవె నాదు దే
వుఁడవు, దయాస్వభావుఁడవు ♦ ప్రోవుము న న్నిఁక జీవితేశ్వరా॥

చ॥ ఇల పయి నాఁడు దాచు జని♦యింపఁగరాదు; జనించె నేనియున్,
వలపును బొందఁ గూడ; దథ♦వా, వల పొందిన, లోనఁ గుళ్ళఁగా
వలయును కాని దాని మగ♦వానికి జూపఁగ రాదు; చూపినన్,
చెలువకు రోఁత మై బ్రదుకు ♦ ఛీ యనిపించుఁ గదా మనోహరా

చ॥ వదనము నైనఁ జూప; విడి♦వా దఁటరా? 'యిటరార'యన్న, నీ
'వదె యిదె'యందుః విడ్డిమరి♦యా దఁటరా? స్ఫుటరాగమూను నన్
కదియవు; భార్యకౌఁగిటనె ♦ కైదఁటరా? కట! రాతిగుండె దా
ల్చెదవుః మదీయసంగమము ♦ చేదఁటరా? విటరాజశేఖరా॥ 42

సీ॥ కంటిని గన్నుల ♦ కఱవు దీఱఁగ, సుమ
శరు ధిఃకరించు నీ ♦ చక్కఁదనము;
వింటిని రతిశాస్త్ర ♦ వివిధరహస్యంబు
లెఱిఁగిన నెఱజాణ ♦ వీ వ యనుచు
అంటిని "కరుణామ♦యా, నీకు నే దక్కి
తిని, నీవె నా కిఁక ♦ దిక్కు"టంచు
ఉంటిని, "నీ కృప ♦ యొకనాఁడు గా కున్న,
నొకనాటి కైన నా ♦ కొదవు" ననుచు;

గీ॥ వింటిని శరాళి సంధించి ♦ విషమబాణుఁ
డొంటిని జుఱుక్కనం గొట్టు ♦ చుండె; వాలు
గంటి, నిదె కేలుమోడ్చి వే♦గతుల వేఁడు
కొంటిని: గవుఁగిటంగవ్వు ♦ కోడెగాఁడ॥

ఆ॥వె॥ నిన్నుఁ గన్నమొదలు ♦ నిముసమున్ మగనితో
అంకుతన మొనర్ప ♦ జంకుపుట్టె:
నన్నుఁ జెట్ట వట్టి ♦ నాదుపాతివ్రత్య
విధిని నిలుపు మయ్య ♦ విటవరేణ్య॥ 44

ఉ॥ హేయపుమాట లన్యు లన♦నీ, కులబంధువు లెల్లరున్ వెలిన్
వేయఁగనీ, చెలుల్ విడువ♦నీ, పతి మున్నగువార లల్లరుల్
చేయఁగనీ, భయంపడను: ♦ చిత్తము నీ కయి దాఁచి యుంచినా
నోయి మగండ, వేఱు మన ♦ ముందము రమ్ము యథేచ్ఛగా నిఁకన్

ఉ॥ సామి, యి దేమిపాప! మొక ♦ జాబున కైన జవాబు వ్రాయ వే
మీ? మృదులాంగుళంబులకు ♦ మిక్కిలి కష్ట మటంచు వ్రాయ లే
దేమొ? యిదొక్కకష్ట మని ♦ యింతభయంపడు చున్న,నా యుర
స్సీమను జందనద్రవము ♦ చిక్కఁగ రాయుట కేమి యందువో?॥

ఉ॥ చిత్తజరూప నీవు కృప♦చేతను నాకిపు డంపినట్టి నీ
యుత్తర మందినంతనె, ప్రి♦యున్ నినుఁ గన్నటులాయె; జన్మమే
నెత్తుట రిత్త పోక, ఫలి♦యించిన యట్లుగ నాయె; నేలపై
హత్తక మిన్ను ముట్టినటు♦ లాయెను: బోయెను చింత లన్నియున్॥

తే॥గీ॥ అక్షరము లమృతకణంబు ♦ లౌచు మాట
లమృతపుందేట లౌచు, వా♦క్యంబు లమృత
ధార లౌచు, నా జీవనా♦ధార మయ్యె
నీవు వ్రాసి పంపినచీటి ♦ నీటుకాఁడ॥ 48

ఉ॥ కంటిని నీదుజాబు వగ♦కాఁడ, కనుంగవ కద్దుకొంటిఁ, జె
క్కంటను జేర్చుకొంటి, నలు♦వ్రేకవల ము ద్దిడుకొంటి, మానసం
బంటఁగ నొత్తుకొంటి, శిర ♦ మం దిడుకొంటిని: దుంటవింటివాఁ
డింటను బంటుగాఁగ నిఁక ♦ నేలఁగ నుంటిని నేఁటి నుండియున్॥

ఉ॥ సామిగ, నన్ను రమ్మనుచు ♦ జాబును బంపితి: వట్లుసేయు, న
మ్మోమ్మ! మఱి యింక నేమయిన ♦ నున్నదె? యెందఱికైన నేను కన్
బ్రాముదు? నా రహస్యమును ♦ పైఁబడ కుండఁగ నీవు దాఁచెదో
యే మని యుంట గోర్కి గల ♦ దేని దలంపకు మిట్టికోరికల్॥ 50

ఉ॥ వింటివొ, లేదొ? పై కడుగు ♦ వెట్టఁగఁ గూడని క్రొత్తకోడలన్:
వెంటనె నీదు కోరికకు ♦ వీ లొదవించుట కెట్లు నేర్తు? పు
ట్టింటికి పోవు నంతవఱ ♦ కించుక యోపిక పట్టితేని, నా
వంటిది యాఁటకత్తెల ధ్రు♦వంబుగ లే దనిపింతు కాంతుఁడా॥ 51

ఉ॥ చాలును జాలు పూరుషుల ♦ సంగతి: యే సతు లేని మీ పయిన్
బేలతనంబునన్ మనసు ♦ వెట్టిన, వారలగుట్టు వీధిలో
నాలవనాఁటి కుండుఁ గద! ♦ నానదు నోటను నూవుగింజయున్
బాలిశ, మీఁక; గోల నగు ♦ బాలను గానుర గోతిలోఁ బడన్॥ 52

చ॥ సరసుఁడ వయ్యు నన్ను వెత ♦ నల్పఁగఁ జెల్లునె? 'చిన్నదాన, నే
మెఱుఁగను, సిగ్గు దీయ,' కని ♦ యెన్నివిధంబుల పాటపాడినన్,
మఱిమఱి ముట్టడించెదవు ♦ మామకచిత్తము నీదు మాటలం
గరఁగునొ? నీదు పుణ్య మగుఁ ♦ గాని, ననున్ విడుమయ్య జారుఁడా॥

చ॥ ఎవ రిఁక నిన్ను నమ్మఁ గల? ♦ రింటికి నింటికి ముగ్గువెట్టినా;
వవసర మంతయుం గడచి♦నంతటనే సుడిపెట్టినాఁడ; వె
ల్లవిభులు నూతనప్రియు లి♦లాస్థలి న న్నటులే చరించు చుం
టి వవుర! నీదు చెల్మికిని ♦ నీకును దండము జారశేఖరా॥ 54

మ॥ ఒకరా, యిద్దఱు, ముగ్గురా, మొదట నెం♦తో నీవు నమ్మించి గొం
తుకలంగోసిన యాఁడువారు?పదుల్ ♦ నూర్లుంగదా? వారు చా
లక, న న్నోతిని ద్రోయ నెంచితివొ? చే♦లం గాను, నా మోహ మా
పుకొనం జూతును గాని, యెన్నఁడును నీ ♦ పొత్తొల్ల జారాగ్రణీ॥

శా॥ నీ పై నే తమయాశ లెల్ల గల క♦న్నెల్ వేనవే లో ప్రియా;
ఆపై నే నిఁక నేల? మీ చెలిమి కే♦నడ్డంబుగా వచ్చినన్,
పాపం బబ్బును; వారలన్ వదలి, నా♦పై నే తమిన్ నిల్పి, న
న్నే పాలింపు మనంగ న్యాయ మగునా? ♦ నీ వైనఁ, బాలింతువా?

చ॥ విభుఁడ, నను వరించుమను♦ విన్నొకసంగతి: యిప్పుడున్న యీ
రభసము తగ్గి నంతటనె ♦ రాకెడపెట్టితి వేని, న్యాయపుల్
సభలకు నెక్కి నేఁ దగవు ♦ సల్పకమానను నిశ్చయంబుగా:
ఉభయుల మప్రతిష్ఠ పడ ♦ కుండెడి మార్గము చూడు మిప్పుడే॥

శా॥ న్యాయం బైన తెఱంగు నేఁ దెలిపెదన్: ♦ నా కీవు నీ మానసం
బీఁయన్ వచ్చును; మానవచ్చు: నది నీ ♦ యిష్టంబె యాఁ;గాని వి
న్నామ, యాదిన్ మన సిచ్చి, యావెనుక మా♦నం బోవ, నే నొప్పనో
నోయీ నాయక, చక్కగా మొదటనే ♦ యూహించి నన్ గోరుమా॥

చ॥ పరవశ మయ్యె నా యొడలు, ♦ భాగ్యవశంబున నిన్నినాళ్లకున్
దొరకిన నీదుపొందున: మ♦నోహర. యయ్యెడనొత్తుకొని మేల్
పరుపున మెత్త నా విరుల♦పైనె పరుంటిమొ, చాపమీఁద ని
ర్వర మెఱమీని గుత్తపుగ♦వుంగిట నుంటిమొ నే నెఱుంగరా॥

చ॥ ఒడలిని చేతితో నిమిరి; ♦ యొయ్యనఁ జెక్కులు ముద్దులాడి; నీ
తొడల వసింపఁ జేసి, తమి♦తోఁ బ్రియవాక్కుల బుజ్జగించి, నా
జడు వుడుగంగఁ జేసి, రతి♦శాస్త్రము నేర్పిన యొజ్జ వౌట నీ
కడఁకువతో నొసంగితిఁ బ్రి♦యా గురుదక్షిణగాఁగఁ గౌఁగిలిన్॥

ఉ॥ నీదు కవుఁగిలింతలును ♦ నీ గిలిగింతలు, నీదు వేసమున్
నీ దరహాసమున్, వగల ♦ నేర్పులుఁ దీర్పులు, నీ నయాటలున్
నీ దయగల్గుమాటలును, ♦ నీ మురిపెంపులు బుజ్జగింపులున్,
నేఁ దలపోయుచున్ మఱవ♦నేరనురా ప్రియ, నీదు కూటమిన్॥

సీ॥ కను విప్పి నను నీవు ♦ కనుఁగొనం దెలికల్వ
విరులు జల్లున రాలు ♦ కరణిఁ దోఁచు;
మోవి విప్పి యొ కింత ♦ నీవు నవ్వినఁ బండు
వెన్నెలన్ మునిఁగిన ♦ విధము తోఁచు;
పలు విప్పి తీయ ప♦లుక్కులు నీవు పల్కిన
అమృతధారం దోఁగి ♦ నట్లు తోఁచు;
కేల్గవ విప్పి కౌఁ♦గిట నీవు ననుఁ జేర్ప
స్వర్గంబు నం దున్న ♦ సరణిఁ దోఁచు;

ఆ॥ వె॥ మనసువిప్పి నీవు ♦ మన్నింప, నాదు జ
న్మంబు ధన్యమైన ♦ మాడ్కిఁ దోఁచు:
నీదు పొందు కంటె ♦ పైదలులకు లేదు,
లేదు, లేదుభాగ్య ♦ మో దయితుఁడ॥

సీ॥ నీ పలుకులను విన్న ♦ నిముసమందే, నాకు
జల్లునఁ గన్నీరు ♦ చిమ్ము చుండు;
నీ కేలు తాఁకిన ♦ నిముసమందే, తను
వెల్లను నాకు జ♦ల్జల్లు మనును
నీవు ముద్దాడిన ♦ నిముసంబునందె, చె
క్కులు మిక్కిలిగ నాకుఁ ♦ బులకరించు;
నీకౌఁగిలిం గన్న ♦ నిముసమ్ము నందె, డెం
దమ్ము దట్టమ్ముగాఁ ♦ జెమ్మగిల్లు;
ఆ॥వె॥ నిన్నుఁ గూడి నపుడె ♦ నెమ్మేను కంపించు,
చేఁత లుడుగుఁ గనులు ♦ మూఁతపడును,
హృదయ మదరఁ దొడఁగు ♦ నది సుఖమో, కష్ట
మో, యెఱుంగఁ జాల ♦ నోయి సామి॥ 63

సీ॥ పలుమాఱు నిన్ను ము♦ద్దులు గొంటి, నీదు చె
క్కిళ్లు కందు నని శం♦కింపకుండ;
ప్రియ మారగా నీదు ♦ పెదవి నొక్కితిని, బ
లొమ్మన నాఁటు నంచు మో♦మోటపడక;
గాటంబుగా నిన్నుఁ ♦ గౌఁగిలించితిని, నీ
యురము నొచ్చు నటన్న ♦ యూహ లేక;
కసితీఱ నీతోడ ♦ గలిసి పెనంగితి,
నలయుదు వనియును ♦ దలఁపఁ బోక;
గీ॥ మున్ను నీ పొందుకై వాచి ♦ యున్న దాన
నౌట, సిన మెత్తినట్లుగా ♦ నైతిఁ గాని,
యింత యొత్తుడు కలిగింప ♦ నింక మీఁద;
బెదరు మాని క్రమ్మఱను రాఁ ♦ గదర సామి॥ 64

చ॥ హృదయములోని భావముల ♦ నెల్లను దెల్పఁగఁ బోవ, భీతి నా
పెదవులు దాఁచి యుంచి మన ♦ ప్రేమకు నడ్డుగ వచ్చెఁ: వాని నీ
పెదవుల బిగ్గఁ బట్టి పలు♦పీడ లొనర్చుచు శిక్షచేయరా;
బెదరును మానుచున్ మణిత♦భేదములన్ హితమున్ ఘటించురా॥

శా॥ స్త్రీవశ్యంబు లెఱింగి, నా మనసు స్వా♦ధీనంబు కావించుకొ
న్నావం చెంచెద? లేనిచో, నెచట నై ♦నన్ నావలెన్ సర్వమున్
నీవే యంచుఁ దలంచి, యొక్కమగవా♦నిన్ నమ్మికొన్నట్టి స్త్రీ
లీ విశ్వంబున నుందురా? చెపుమ, నీ♦వే యోయి ప్రాణేశ్వరా॥

చ॥ తనివి జనింప కున్నయది ♦ తావకరూప మ దెంత చూచు చు
న్నను, బలుమాఱు చూతు నని♦నం, జనుదేఱక యుంటి వీవునున్;
విను, నదుపాయ మొండు విని♦పించెదఁ: బూత్తిగ నిన్నుఁ బోలు చ
క్కనిమగవాని నొక్కరుని ♦ గాంచుము నా వలనన్ మనోహరా

సీ॥ అల్లంతదూరంబు ♦ నం దుండియే నేను
విన 'ఈలలన్' వేసి♦కొనుచు వత్తు;
వెవరినో వీధిఁ బో♦యెడివారలం బిల్చి
నట్లు గట్టిగను జ♦ప్పట్లు చఱతు;
వింటిగుమ్మమునకు ♦ నెదురుగా నిలు చుండి,
కేండ్రించి యుమియఁగా ♦ కేకరింతు;
వేను గన్పడి నంత ♦ నే స్పష్టముగను జే
తులనెత్తి నాకు సైఁ♦గల నొసర్తు:

గీ॥ వెవరు చూతురో యనియు నూ♦హింప వేర?
మాయురే పండు వంటి నా ♦ మనువునకును
నీళ్లుపోయకయున్నచో, ♦ నీవునాకు
అంకుమగఁడవు కావఁట♦ర? విటకాఁడ॥ 68

చ॥ నలువురిలోన నన్నుఁ గని ♦ నవ్వుచు నిల్తువు; కంటిసైఁగలం
దలఁపు లెఱుంగఁ జేసెద; వె♦దం జెయి చేర్చి శిరంబు వంతు;వూ
ర్పులు నిగిడింతు; వోష్ఠమును ♦ ముద్దుల కొగ్గెద: విట్టులైన, నె
ట్టులు మనగుట్టు నిల్చు? మగఁ♦డున్ బసిపట్టఁ గదా మనోహరా॥

చ॥ గడె కొకజాబు నంపెదవు; ♦ కన్పడ కున్నను, మాటిమాటి కి
క్కడ కరుదెంతు: వింతతమ♦కంబున వేగిరపెట్ట, నా కెటుల్
గడచును? నీవు కోరినప్ర♦కారముగా నను రేబవళ్లు నీ
కడఁ బడిగాపు లుండు మనఁ♦గా, వశమా? మగనాలరా ప్రియా॥

చ॥ రమణుఁడ, నేను రామికిఁ జి♦రాకును జెందకు; కత్తికోఁతకా
డు మగఁడు బ్రహ్మరాక్షసున♦టుల్ ననుఁ గాఁచియె యుండు నెట్లుగా
సమయము చిక్కునో యెఱుఁగ; ♦ సందొకయించుక కల్గె నేని, నీ
సముఖమునందు వ్రాలుదును ♦ చప్పున టెక్కులు దాల్చి యైనను॥

ఉ॥ ఇంచుక యేని పై కరుగ ♦ నీయవు; పై మగవారితోడ భా
షించుట కొప్ప; విల్ వెడలఁ ♦ జేర వలెన్ నిను; పుస్తె కట్టి పో
షించుమగండు నీ యమలు ♦ చేయఁ దలంపఁడు: నీకు లొంగినా
నంచును, నింత లోకు వఁట♦రా యొనరింతువు జార శేఖరా?॥

ఉ॥ అమ్మకచెల్ల! కంచు పదు ♦ నైనది నీ మది యం చెఱింగి, నా
సమ్మతి యెల్లఁ జంపుకొని, ♦ సాధ్య మసాధ్యము నెంచ కీవు న
న్నెమ్మెయిఁ ద్రిప్పుకొన్న నటు♦లే తిరుగాడుచు నుంటి: నిట్లుగా
నమ్మితిఁ గాన, నెన్నఁడును ♦ నన్నెడఁబాయకుఁ బ్రాణనాయకా॥

చ॥ 'వలవదు నీదుచెల్మి, మగ♦వారల నమ్మఁగ రా' దటంచు నేఁ
బలుకఁగ, నమ్ము మంచు పలు ♦ బాసలు సేయుచు నాదుసమ్మతిన్
బలిమిని బుచ్చుకొంటి: విటు♦పైఁ గద నీదు నిజం బెఱుంగఁగా
వలె? వగకాఁడ, 'నమ్మి చెడు♦వారలు లే' రనుమాటనిల్చురా॥

ఉ॥ ఆసలు పుట్టు నట్టులుగ ♦ నచ్చికబుచ్చిక లాడి, యెన్ని యో
బాసలు చేసి, యాపయి సెబాసు! మొగంబును జూప వైతి వో
యీ సరసుండ; మోసము సహింపను: నీవిటు కృష్ణవేషముల్
వేసిన, భామవేషమును ♦ వేసి జడన్ నినుఁ గొట్టెదం జుమీ॥ 75

చ॥ సరసుఁడ వంచు నిన్ గని పసందొనరించితిఁ గాని, సంతులం
దిరుగు పదారవిందములు ♦ నీ వని, నెందుకు మోహమొందుదున్?
దిరిగెడి కాలు నీ దయినఁ ♦ దిట్టెదు నట్టిది నాదునోరు: వే
గిర మరుదెంచి, ముద్దుల బిగింపుము నా పెదవుల్ మనోహరా॥

ఉ॥ తప్పిద మీవు చేసియును ♦ దప్పులు నా పయి మోఁపి చప్పునం
జెప్పక లేచిపోతి వతి ♦ చిత్రముగా! నిను నేను వేఁడుకొ
న్నప్పుడె రాఁ దలంచితివొ? ♦ నట్టుగ బెట్టుగకూరు చున్న, నే
నొప్పను: నీవె ముందుగఁ బ్రియుండ, ననున్ బ్రతిమాలుకో వలెన్॥

ఉ॥ ఏమిటి నేను తప్పు ఘటియించితిఁ గన్నుల నెఱ్ఱ చేసి నె
మ్మోము ముడించి పోవుటకు? ♦ ముక్కున నింతటికోపమా? యిదే
ప్రేమకు లక్షణంబొ? యిటు ♦ బెట్టొనరించినఁ దాఁళఁజాల; రా
రా మఱి యల్క పెండ్లికొడుకా! బ్రతిమాలితి నేనె ముందుగా॥

ఉ॥ ఆఁడుది యల్గినం బురుషుఁ ♦ డామెను దేర్చుటపోయి, నాపయిన్
ఖేఁ డిట్టు నీవె యల్గుటయు ♦ నేను నిను బ్రతిమాలుకొంటయుం
జూడఁగ వాడవాడలను ♦ సుందరు లంతలు నవ్వకుందురా?
ఘోడిని మాని రాఁ గదర ♦ మ్రొక్కెద నీదు పసిండికాళ్లకున్

ఉ॥ అట్టె విశేషమోహమున ♦ నాఁడుదియు న్మగవాఁడు నుండ, గన్
గట్టును మొండదైవమున కున్: మన యిద్దఱ ప్రేమఁ జూచి, యి
ప్పట్టున నన్యదేశములఁ ♦ బట్టఁగఁ జేసెను నిన్ను దేవుఁ; డే
నెట్టు భవద్వియోగము సహింపఁగఁ జాలుదురా మనోహరా?॥

ఉ॥ లేచిన దాది నిద్రకయి ♦ లేచినదాఁకను నిన్నుఁ గూర్చి యా
లోచనయేకదా? కలల♦లో నినుఁ జూచుటయేకదా? నినుం
జూఁచిన దాఁక తాళ; ననుఁ ♦ జూడఁగ వీలు ఘటిల్లి నంతనే
వే చనుదెమ్మ, క్షేమమును ♦ వెంటనె వ్రాయుమ యోయి నాయకా॥

చ॥ ఉదయము నుండి రాత్రివఱ ♦ కో ప్రియ, నిన్నుగుఱించి నేఁ బదిం
బదిగఁ దలంచు చుండెదను: ♦ బాప మొకాల్ వలఁబోలు చుందువో
గద? యొకమారు నే నటులు♦గాఁ బలఁబోలుట లేదు: నన్ను నీ
వు దలఁచు చుందువో, తలఁప♦వో, పయివింతలలోన మున్గుచున్?

ఉ॥ ఆ పయిచోట కుల్కుజవ♦రాండ్రును, జక్కనిమాయలాండ్రునుం
గాఁపుర ముండ్రు: వారలు వ♦గల్ కురియింతురు; లేనిమోహమున్
జూపుదు; రిచ్చకంబులను♦ జొత్తురు: వారలమాయ లందు నీ
వేపగిదిం దగుల్కొనక ♦ యిచ్చటికిన్ మరలంగ వత్తువో?॥ 83

ఉ॥ ఆ నెనరా సమాదరణ, ♦ మా వల, పా యభిమాన, మా ప్రియం
బా నయ,మిన్నియున్ సతము ♦ లంచుఁ దలంచుచు పొంగు చుంటినే
గాని, హఠాత్తుగాఁగ మన ♦ కాఁపుర మిట్టులు తెల్లవాఱు నం
చే నెఱుఁగన్: దినంబు లిఁక ♦ నెట్టుల దాటును నాకు వల్లభా॥ 84

ఉ॥ కన్నులనీటచే కరఁగి, ♦ కాటుక రేఖలు నాదు చెక్కులం
దున్నవి: నీవు నిర్దయుఁ బ్రి♦యుండ, ననున్ విడనాడి నంత నుం
డి, న్నిరతంబు నే: బడిన ♦ నెవ్వగ నియ్యవి లేఖ లాచుఁ దె
ల్పు: న్నయనంబులం దెఱచి, ♦ పూర్ణకృపం దిలకింపు నా దెసన్॥

ఉ॥ 'కోరినపూరుషుండు సమ♦కూఱెను, గోరిన యట్లతండు నన్
గూరిమిఁ జూచు చుండె, రమ♦ణుల్ మఱియెవ్వరు నాకు సాటి?' యం
చూరక నేను గొండ పయి ♦ నుండఁగ, నన్ విడనాడి నీవు నా
కోరిక లెల్ల నేలకును ♦ గూలిచినాఁడవు నిర్దయాత్ముఁడా॥ 86

చ॥ వలచితి నిన్ను, నీ వలపు ♦ వాంఛ యొనర్చి గడించితిన్; నినుం
గలిసితి, నీవు నన్ కలియఁ♦గా సుఖవార్ధిని మున్గి తేలితిం;
జెలువుఁడ, జన్మ సార్థకత ♦ చెందితి; నీ వెడఁబాసి తంచుఁ జిం
తిల; నలనాఁటిసౌఖ్యమె మ♦దిం దలపోయుచుఁ దృప్తిచెందెదన్॥

చ॥ విడిచితి వారు వీ రనక ♦ విశ్వము నీ కొఱః కట్టి నన్నుఁ బో
విడిచితివా? 'యొకప్పుడును ♦ వీడ,' న టన్న ప్రమాణవాక్యముల్
విడిచితివా? ధరాజనులు ♦ విన్నను సిగ్గగు నన్న భీతియున్
విడిచితివా? సరే, విడిచి ♦ పెట్టుము దోసెడునీళ్లు నాకు నై॥

మ॥ విటరాయా, మటుమాయమాటలను వే♦నే లాడి ము న్నీవు న
న్నెటులో యొప్పఁగఁ జేసినాఁడ, వది నేఁ♦డే మయ్యె? మూన్నాళ్లము
చ్చటకా నన్నిటు వీధిఁ బెట్టితి? వెదన్ ♦ జం కైననుం బుట్ట లే
దఁటరా? యప్పుడె క్రొత్తవింత చెడి యా♦హా! ప్రాఁతరోఁ తయ్యెనా

ఉ॥ వేళ లభింప దాయె నని, ♦ వీలు ఘుటిల్లక యున్న దంచు, ని
ల్లాలికి కోప మంచు, మిష♦లన్ వచియించెద వేర? నా పయిన్
బాళి నశించె న న్న దె ని♦బద్దిర: నీ కిపు డొక్క–చొక్క–పున్
బాలికయే తటస్థ మయి♦నన్, గ్రహియింపక మానుకొందువా?॥

చ॥ మనసు నొసంగనో? మిగుల ♦ మక్కువ చూపనో? భక్తితోడ నీ
పనుపు లొనర్పనో? హృదయ♦పద్మములోపల నిన్ను దేవుఁగా
ననుదినమున్ స్మరింపనో? ప్రి♦యా, ననుఁ బాయుట కేమిదోష మే
నొనరిచితిన్? ప్రమాద మెది♦యో ఘటియిల్లిన, సైఁపఁ జెల్లదే?

చ॥ కుతుకము గల్గె మున్ను ననుఁ ♦ గూడుట; కాతమి యెల్ల నిప్పు డ
ద్భుతముగఁ బోయె నో ప్రియుడః♦దూరపుకొండలు చేరు నై నఖ
క్షతముల నున్నపాయుటనొ? ♦ కాక, తినం దిన గారె లందుఁ జే
దు తగులు నట్లుగా సరుచి ♦ తోఁచెనొ నా మధురాధరంబునన్?॥

చ॥ ఒడఁబడ కుండ నే బిగిసి ♦ యున్న దినంబుల నాదు పొందు కై
పడఁగను రాని పాట్లు పడి, ♦ పల్మఱు నన్ బ్రతిమాలుకొంటి; వి
య్యెడ మొగ మైనఁ జూప, విది ♦ యేమిర? 'యక్కఱ తీఱె నంత, నె
క్కడప్రియు?' లన్న పాట పగ♦ కాఁడ, యదార్థము చేసినాఁడవా?

ఉ॥ నొచ్చున టంచు నీ పెదవి ♦ నొక్కఁగ నైతిని, నొచ్చు నంచు నిన్
గ్రుచ్చి కవుంగిలింప మది ♦ కోర్కులు తీఱఁగ కాల మున్న దం
చిచ్చ యడంచుకొంచుఁ జరి♦యించుచు నుండఁగ, నింతలోన నే
తెంచె వియోగ మయ్యయొ! వి♦ధిన్ మఱి యెవ్విధిఁ దిట్టుదుం బ్రియా

మ॥ సరసుం డై నరి గాఁగఁ బెక్కుసతులన్ ♦ సంప్రీతి శ్రీకృష్ణుఁ డొ
క్కరుఁడే సల్పఁగఁ జాలె; త క్కొరుల క♦ క్కార్యంబు శక్యంబె? 'యి
ద్దఱ పొం దేలర? వద్దువ,' ద్దనిన, మున్ ♦ దర్పంబు లీ వాడి, య
ద్దిర! నేఁ డింటిభయంబు నొక్కమిషగాఁ ♦ దెల్పంగ నెట్లొప్పెదున్?

మ॥ ఎలమిన్ నీ విటులుండ, నేనవతి యో ♦ యే రాలొ యీ సూని క
న్నులలో నిప్పులు పోసికొంచు మన పొం♦దుం బాపె; నీ కౌఁగిటం
గులుకం గోరియొ? దాని నా యుసు రిఁకం ♦ గొట్టన్ వలెన్ నాథ! నా
వలెనే యద్దియు నీకు దూర మయి తీ♦వ్రగ్లాని పొందన్ వలెన్!॥

శా॥ నీ విం కొక్కతెమీఁద రంగుపడి దా♦నింగూడి యుప్పొంగుచున్
వేవేభంగుల క్రింద మీఁదఁ బడ, మీ♦ స్వేచ్ఛావిహారంబులన్
నే వారింపను గాని, యొక్కటి మదిన్ ♦ నిక్కంబుగా నెంచుకో:
మ్మాశ్రవం తైనను నీకు నా యుబుసు లే♦ దన్నట్టు లుండన్ వలెన్॥

ఉ॥ వింటిని వింటి, నీ కిపుడు ♦ వేఁడుకకత్తెయొకర్తు క్రొత్తగా
నంటస మయ్యె నంట! యటు ♦ లౌటను నన్నెడఁ బెట్టితంట! నా
యింటికి రాక యుండ, నది♦ యే మొలలోఁ జెయినెట్టి యీఁపునో?
వెంటనె యాఫలం బనుభ♦వించెద, వుండర నీవు ధూర్తుఁడా॥ 98

ఉ॥ ఓరి, ననుం ద్యజించి మీరె ♦ యొక్క-తెకుం దగులాట మైతివా?
కూరిమి మీర లిద్దఱును ♦ గుల్కఁ దలంచితిరా? సరే, మిముఁ
దూరము చేసి, నాసవితి ♦ తుళ్ళడఁగించి కలంప కున్న, నా
పేరును బెట్టి నన్నిఁకను ♦ బిల్వకురా సరివారిలోపలన్॥ 99

ఉ॥ మంగళ మేను నీకుఁ బలు ♦ మారును గోరెద; నీవు నన్ను నే
భంగిఁగఁ జేసినన్ సరియె; ♦ పాలను ముంపుము, నీళ్ళ ముంపు: మా
సంగతి తోడ నా కొకప్ర ♦ సక్తియు లేదు; శుభాంగ, నిత్యమున్
మంగళమూర్తి నీకు, జయ ♦ మంగళమున్, శుభ మంగళంబునున్!॥

జాబులు రెండుభాగములు

సంపూర్ణము.



సరసోక్తియుక్త

# కృష్ణ శ త క ము.



గ్రంథకర్త.

సెట్టి లక్ష్మీనరసింహ్వాము.

## —• సరసోక్తులు. •—

——)○(——

' రామాయణము ఱంకు, భారతము బొంకు '

' బూతుపూకుమాట ఆడితే, కాని పూకు సంకెళ్లు పడతవి '

' బూతు లేదు; ఆఁతు లేదు; కాలెత్త వమ్మా కట్టి పెడతాను '

47

శ్రీరస్తు.

# సరసోక్తియుక్త

# కృష్ణశతకము.



శ్రీరమణీకళత్ర, సర
సీరుహపత్రవిశాలనేత్ర, వి
స్తారకృపారసంబునఁ బ్రి
జాపరిరక్షణ మీవొనర్ప భూ
భారము వృద్ధి కాఁగ, నది
పాపఁగఁ గృష్ణుఁడ వై జనింపవే?
'నేరక వచ్చినన్ కడుపు
నేరుపుతోడనె దించుకోవలెన్'॥

క॥ హరిహరి! 'గాడిదమొడ్డయె
గరుడస్తంభంబు' గాఁగ ♦ గాడిద కాళ్లన్
శిర మిడె వసుదేవుఁడు: దది
యఱచిన నీ కార్తి గల్గు ♦ నని శ్రీకృష్ణా! 2

క॥ ప్రియమున దేవకి కనె ని
న్ను; యశోదకు నేగతిం ద♦నూజుండవు నీ
వయితో? 'దెంగులు గుఱ్ఱము
వియుఁ బిల్ల దివాణమ్ముఁ'దను ♦ విధమునఁ గృష్ణా 3

ఉ॥ అంగన లెల్ల గొడ్డుముస • లమ్మ యశోద కుమారుఁ గాంచె వం
చుం గమలాయతాక్ష, నినుఁ • జూడఁగ సాగిరి: యద్భుతంబు హె
చ్చంగ 'విచిత్రవిప్రునకు • చన్నులు పుట్టగ' నీవు నందు, పం
చాంగపుబ్రాహ్మణుండు పలు • సారులు జూచుచు నవ్వె నట్లుగన్॥

ఆ॥వె॥ నీదుబొడ్డు తమ్మి • ని విరించి యుంట నీ
బొడ్డు కోయ, నతని • మొడ్డ తెగునొ?
'బొడ్డు కోయఁ, బోయి • మొడ్డ కోసిన యట్టు'
లనుచు జంకె దాది • యబ్జనాభ॥ 5

తే॥ గీ॥ కంసుపంపున నిన్ జంపఁ • గాఁ దలంచి
యరుగుదెంచిన పూతన • యాదిగాఁగ
నసురవితతి నీచేఁ గూలె • నౌర! 'దెంగఁ
బోయి తెంగించుకొను' టిదే • తోయజాక్ష॥ 6

తే॥గీ॥ చక్కని యొయ్యారి యై వచ్చి • చన్నుగుడుపు
పూతనను నీవు గూల్పఁ బె • న్భూత మగుచు
మడిసె: 'ఇల్లాలియొడిలోన • మల్లె లుండి,
విప్పిచూడ చుల్లలుగల • చొప్పన'హరి॥ 7

మ॥ పరికటం బౌ సుడిగాలిచందమున నిన్ • బైకెత్తి కొంపోయి, చం
పకయున్ నొంపకయున్ దురాత్ముఁడు తృణా • వర్తుండు పెన్ ధూళి నం
గకముల్ గప్పెను: 'దేంద్రనాకొడుకు దెం • గన్ లేఁడు, వంగంగ లేఁ,
డిఁకఁ బో కెల్లను సాదు చేసె' నను టి • ట్లేకాదె? దామోదరా॥

ఉ॥ బాలుఁడ వైన కాలమునఁ • బల్మఱు గొల్లవెలందు లుట్లపై
వ్రేలఁగఁ గట్టు చట్లఁ గల • వెన్నను నింటికి ముద్దచొప్పునం
గ్రోలఁగ నీవుఁ దృప్తి గలు • గుం గద! 'ఇంటికి నొక్కయాక,యి
ల్లాలికి నొక్కగొంగళి' గ • దా? నవనీతహరా, పరాత్పరా॥ 9

ఉ॥ పెట్టిన యట్టి గొంఁడెములు ♦ వేసిన బీగము లట్లె యున్న, నె
ప్పట్టున నీవు నీ జనని ♦ ప్రక్కనె యున్నను, బాలు మాయ మా
నుట్టిని! 'ముద్ర ముద్రవలె ♦ నుండఁగ, ముగ్గురుబిడ్డ లెట్టులో
పుట్టి' ర టన్నమాట యిదె ♦ పో గరుడధ్వజ, యో యధోక్షజా

చ॥ దుడుకుఁదనంబునన్ గడవ♦దొంతుల మీఁగడ లీవు పూర్తిగాఁ
గుడిచి పరున్న వేళ యగు ♦ కోడలిమూతికి రుద్ది, దానిన
ప్పుడడఁచె నత్త! 'దెంగుకొని ♦ పోయినవానికి దెంగులే, కిఁకం
దడకను దీయు నాతనిది ♦ తప్ప'ను చొప్పున నందనందనా॥ 11

ఆ॥ వె॥ నీదు చిన్ని బొజ్జ ♦ నిఖిలలోకము లెట్లు
పట్టె? 'అత్తపూకు ♦ పత్తిగింజ,
మామమొడ్డ దొడ్డ ♦ మంచపుకో' డను
నట్టు లుండె, తల్లి ♦ యరయకృష్ణ॥ 12

చ॥ మునులమనమ్ము లందు, సిరి♦ముద్దియ నిండు కవుంగిటన్ సత
మ్మును మునుకట్టి పొందు నిను ♦ మూఢతతోడ యశోద ఱోట బం
ధన మొనరింప నెంచె నఁట ♦ దాన భయంపడినాఁడవే హరీ?
'చినిఁగినపూకు దెంగుల కి♦సీ! జడుపుం గనునే' యొ కప్పుడున్?॥ 13

శా॥ రాకాసుల్ నిను వేనవేలు బరిమా♦ర్పన్ బృంద యం దుంటచే,
నీ కేళీసమయంబు లం దొకొకఁడే ♦ నిన్నాఖలుల్ దాఁకరే?
'కాకుల్ గల్గినయూర నేకులను నే♦కం, గాకియే తెంచి తాఁ
బూకుం బొడ్చె' న టన్నసామెతగతిన్ ♦ భూమీధవా, మాధవా॥

క॥ నినుఁ బరమాణుసమానుని
దన కుక్షిని నిలుపుకొనఁగఁ ♦ దలఁచి బకుఁడు మ్రిం
గె నహా! 'గం పంతటిపూ
కున గాడిదమొడ్డ చిక్కు♦కొనునె మురారీ?॥ 15

క॥ 'కంఠంబు దిగిన యెడలను
శంఠంబును దెగ' ద టన్న ♦ సామెత యో వై
కుంఠా, యే మయ్యె బకుఁ డ
కుంఠితగతి నిన్నుఁ గ్రోలి ♦ కూలినవేళన్?॥ 16

చ॥ మదమున నిన్నుఁ బట్టి పరి♦మార్ప నెదం దలపోసి కాళియుం
డెదురుకొనంగ, వానితల ♦ లెల్లను బిప్పిగ నీదుకాళ్లతోఁ
జదుపఁగ లేదె నీవు? 'సర♦సంబునకున్ సరసుండు వోవఁ, జ
న్ను దలిగి కన్న వోవుట' క♦నుంగొన నిట్టిదె! గోపడింభకా॥ 17

—♦ మత్తకోకిల ♦—

'ఈతపండ్లకుఁ జెట్టు నెక్కఁగ, ♦ నిత్తుపెములు నాటెనె'
ట్లీత లాడఁ గళిందజానది ♦ నీవు మున్గఁగ, గాళియుం
'డీతముల్ విఱుగంగ దెంగఁగ ♦ నెంచు' నిన్ పడిఁ బట్టి, యా
హా! తుదన్ వగ నొందె శేషశ♦యాన, హో గరుడధ్వజా॥ 18

చ॥ 'గిలకకు నీరునున్ దగని' ♦ కేవలబాలుని నిన్నుఁ బిల్చి, నీ
తళుకు మెఱుంగు చెక్కిలి ము♦దంబున నొక్కి, స్తనద్వయం బుర
స్థలమునఁ గ్రుమ్మి, రాధ రతి ♦ సల్పఁగ, 'అవ్వకు దూల తీఱె న
ట్టులు, మనుమందు నేర్చిన య♦టాల్' గనుపట్టెను గాదె మాధవా?॥

ఉ॥ మాధవ, ప్రక్కలో నులక♦మంచముపై నిను జేసికొంచు తా
బాధలు చిన్నటం బడియెఁ; ♦ బ్రాయమునం బుపుఁబోన్ను మీఁద ని
న్నే ధవురీతిఁ జేర్చికొని ♦ యెంతయు మన్మథసౌఖ్యముల్ గనెన్
రాధిక: 'కచ్చ నుచ్చయును, ♦ తైకను చేయి' య టన్నవైఖరిన్॥

ఉ॥ కొంచెపుప్రాయ మందె రసి♦కుం డగుచుం గిసి దీఱ రాధికన్
దంచెను చిన్నికృష్ణుఁడు ము♦దం బొనఁ గూర్చుచు నన్నవార్త చా
టెంచిన యట్లు ధాత్రిఁ బ్రిక♦టిల్లెను: 'పూఁకును డప్పు చేసి వా
యించుట' యన్న మాట కిది♦యే యగు కారణ మద్రిధారణా॥

చ॥ పటు విరహంపునొవ్వలకుఁ ♦ బొల్పడి మోహము గన్న గోపికల్
కటకట! నీదు ప్రక్కఁ బడఁ♦గాఁ గదుఁ గోరియు, వస్త్రహీన లై
తటుకునఁ నీకుఁ గన్పడఁగఁ ♦ దద్దయు జంకిరి: 'మంత్రిసానిముం
దటనె యుపస్థ దాఁచిన' వి♦ధంబున గోపవధూమనోహరా॥ 22

తే॥ గీ॥ 'నదిని వెల్వడి చే యెత్తి ♦ నాకు మ్రొక్కి,
చేలముల నిత్తు', నని నీవు♦ చెప్ప, గొల్ల
పడఁతులకు 'పూఁకులోఁ బుండు; ♦ బావగారి
వైద్య' మను నట్టు లాయె నో ♦ వారిజాక్ష॥ 23

—♦ రత్నావళి ♦—

'అమ్మఘవుజాతరన్ మానినచో నాపద వాటిల్లు న టంచున్
నెమ్మది భయపడ నేల? 'పూఁకుపెండ్లికి నగరకటకపున్ బాజా
సుమ్మ, మొడ్డపెండ్లికి ముఖలింగపుసాన్నాయిను' మ్మనుట యిదియే
నమ్మ,' యని నీవు గొల్లలన్ మాన్పి, నగము నెత్తలేదే శౌరీ?॥ 24

తే॥ గీ॥ వ్రజి సంరంభమున రాల♦వాన కురిసి
తుదకు, 'నత్త, నీకొడుకు గం♦దోళిగాఁడె,
పత్తిమీఁద చేతిని వేసి ♦ పల్కకుండు'
నను నటులె చేసె, కృష్ణ, నీ ♦ వదినెత్త!॥ 25

తే॥ గీ॥ వనజనాభ, నీ మొగముసొం♦పునకు వలచి,
పడఁతు లెందరో నీపయిఁ ♦ బడిరి: 'మొగము
తేట పూఁకకుచే' టను ♦ మాట గలదు;
మొగముతేట మొడ్డకును జే♦టగుట క్రొత్త!॥ 26

ఉ॥ "అవ్వలిమాట చూచుకొన♦రా? 'మగరాజుల కేమి? మొడ్డకున్
బువ్వులు చుట్టఁ బెట్టుకొని ♦ పోదురు' నన్ జతగూడి యుండినన్
దవ్వగుకాఁపురంబులు; స♦దా తలవంపులు మీకుఁగల్గు నో
జవ్వనులార," యన్నను వ్ర♦జప్రమదల్ వినిరా రమావరా?॥ 27

తే॥ గీ॥ గొల్లతలు శైశవమున నీ ♦ బుల్లిపండు
గుడిచి, పాశ్రియంబునన్ మోవి ♦ కొఱికిరి; యదు
బాల, 'అసలున కధరోష్ఠ♦పానము, మఱి
వడ్డికిన్ శిశ్నపాన' మన్ ♦ వరుస మార్చి॥ 28

చ॥ బలు తిమిరెంపుఁ బ్రాయమునఁ♦ బైఁబడ వచ్చిన గొల్లయన్నుమి
న్నలఁ గవ గూడుచున్, ముదము♦నన్ యమునాతటభూములందు వ
ర్తిలుదువు గాదె నీ వెపుడు? ♦ 'దెంగఁగ నేర్చినమొడ్డ నీళ్లరే
వుల నిరతమ్ముఁ గాఁచు' నను ♦ పోలిక సుందరగోపబాలకా॥29

ఉ॥ ఉద్ధవమిత్రఁ గొల్లెతల ♦ యొద్ద వరుండి, భగంబులం గనన్
బుద్ధియు, నంత వారవలి♦మోహ మయినన్ గటు లంటఁగా గుణం,
బిద్ధరణిన్ జనింపఁగనె ♦ యేర్పడె నీకహా! 'పూకుఁ జూచినన్
బుద్ధియు, గుద్దఁ జూడ గుణ♦ము'న్ మది కన్నది టన్వయించితో?

క॥ పెరిగితి గొల్లల వెన్నను;।
మరిగితి వా గోపసతుల! ♦ మఱి వే జేలా?
'ఇరు గమ్మ వండిపెట్టఁగ,
పొరు గమ్మయు దెంగి పెట్టు' ♦ పోల్కి యిదె హరీ॥ 31

ఆ॥ వె॥ "'పత్తె దేవళంబు, ♦ పైపె సిండ లింగంబు,
నందు లోని సాడె ♦ యమృత' మగును
నాదు శిశ్నభక్తు ♦ న," కటంచు గోపకాం
తలకుఁ జెప్పుదువుగ♦దా? ముకుంద॥ 32

శా॥ కాళిందీతటసైకతంబుల రతుల్ ♦ గావించి నీతో, వ్రజ
స్త్రీ లెల్లం దుడువంగ నీయరుగదా ♦ దేహంబు లందంటు త
ద్ధూళుల్, ద్వద్విమలాంఘ్రిచిహ్నముల నొం♦దుం గావునన్ శ్రీహరీ?
ఛాలే! 'ఱంకుమగందు పేఁపు తుడువం',♦డం చుల్లసం బాడుచున్

ఉ॥ వేడుకకాఁడ వీవు వన♦వీథిఁ దొలంగి చనంగ, గొల్లపూఁ
బోఁడులు నీదువేషమును ♦ బూనుచుఁ గొందఱుఁ, గొంద ఱింతులై
క్రీడ యొనర్చినా రఁట! హ♦రీ, విరహంబునఁ నేమిలాభమో?
'బోడియు బోడియుం గలియ ♦ బూడిద రాలు' నటం చెఱుంగరో?॥

ఆ॥ వె॥ బృంద యందుఁ దిరిగి ♦ పెరుగు నిన్ సాధింప
నేర కౌర! కంస ♦ నృపతి 'చేఁత
కాని మగఁడు పూఁకు♦పైని గుద్దినయట్లు'
నీదుపితలఁ జెఱను ♦ నిలిపెఁ గృష్ణ॥ 35

చ॥ అనయము గోపికాజనస♦హస్రముతోడను రాసకేళిలోఁ
దనరుచు బృంద నున్న నినుఁ ♦ దా మధురన్ వధియింపఁ బిల్వఁ బం
పిన యల కంసుఁ జీల్చెఁ గద? ♦ 'వెల్గునఁ గల్గిన కొఱ్ఱు తీసి గు
ద్దను దిగఁ గొట్టుకొంట'కు ని♦దర్శన మిద్దె సుదర్శనాయుధా॥ 36

తే॥ గీ॥ అదనునకు వస్త్రగంధమా♦ల్యాదులు లభి
యింపఁగ గ్రహించి, కుబ్జతో ♦ నింపున రమి
యించి, కంసుని బరిమార్చ ♦ నేగితి వహరి!
'అడవిలో దెంగి యాకునఁ ♦ దుడిచి నట్లు'॥ 37

శా॥ "ఓరీ బాలక; వజ్రకర్కశమదీ♦యోరస్థలం బైనఁ గు
ద్దోరా, పోరక పోర,' యంచునిను చా♦ణూరుం డనన్; వానితో
నీ రేకేక్షణ, "'పూఁకు పూకెఁడును, పై♦నిన్ దోసెఁ' డన్నట్టు లే
రా రారాపు లొనర్చ? పోరఁగను రా♦రా,'' యం చిలం గూల్చవా?॥

తే॥ గీ॥ దుష్టు లగు వారు నీకు బం♦ధువులె యైన,
నవనిఁ గూల్చవె వారి? "మే♦నత్తకొడుక,
మెల్లగా దెంగరా' యన్న ♦ మిన్న కుండు
నట్టి వెఱ్ఱియెఁ గలఁడె కం♦సాసురారి॥ 39

ఉ॥ గోకులభూమికిన్ మగుడ ♦ గొబ్బున రామిని నీదు రాకకున్
రాకకుఁ గల్వ లట్లు ప్రతి♦రాత్రియుఁ జూచుచు మన్మథజ్వర
వ్యాకుల లైన గొల్లజవ♦రాండ్రకు నక్కట! మిక్కుటంబుగా
'పూకనఁబోటు, బుజ్జనలు♦వుం' గలిగెన్ మధురాపురీచరా॥

తే॥ గీ॥ "మిగుల మఱుగుజ్జు గాన ని♦మ్మొలఁత మేన
నెగువభాగంబు కంటెను ♦ దిగువ కుఱుచ,
'నాడె మగునాయరాలికి ♦ నడుమ బో'," క్క-
టంచు నెగ నెత్త వే కుబ్జ ♦ నబ్జనాభ?॥ 41

చ॥ ఘనతరు లైన మాగధము♦ఖప్రతికూలనృపాలపాళిచే
దినదినగండ మాటను మ♦దిం గని, రాధ వరాధరామృతం
బనయముఁ గ్రోలు చుందు వఁట!♦ 'అత్తను దెంగిన నాయువెక్కువౌ'
నని యెడిమాట నిక్కముగ ♦ యాదవశేఖర, రాధికావరా॥ 42

ఉ॥ "ఇక్కడ యుద్ధ మేల, జయ ♦ మేటికి? వీనిని నాదు వెన్కనే
కుక్కను బోలె త్రిప్పి ముచి♦కుందుని జేర్చినఁ జచ్చుఁ; 'గొట్టఁగా
నక్కఱ లేదు; తిట్టుటయు ♦ నక్కఱ లే,' దని పట్టి వట్టలన్
నొక్కిన యట్లు" కాలయవ♦నున్ వధియింపవె? యో చతుర్భుజా॥

తే॥ గీ॥ పెంచి యిళను రాధిక నీకు ♦ పెండ్లి చేయ,
నిన్ను, రాధికం, బాపి యా ♦ కన్నె నీల్గఁ
దొడఁగ, 'పెంచుకోడియె యిత్తు ♦ పొడిచి' నట్టి
లీల దయమాలి యో వన♦మాలి, మున్ను॥ 44

చ॥ రమణుఁడ, నన్నుఁ జేకొనఁగ ♦ రమ్మని రుక్మిణి వ్రాసి పంప, నా
కమలదళాక్షి నా కరణిఁ ♦ గైకొని, యచ్చెలిమిన్న యన్న మీ
సములను నున్నగా గొఱిగి♦సైతము వచ్చితి వౌరఁ 'పిఁపు గోఁ
కు మనిన, చన్ను పట్టుకొను'♦ కుబ్జతనంబును జూపి కేశవా॥ 45

ఉ॥ చేవ దలిర్పఁగాఁ దనదు ♦ చెల్లెలిఁ జైద్యున కిత్తునంచు సం
భావన రుక్మి చేసినను, ♦ మాగధముఖ్యనృపాలు రడ్డినన్,
కేవలశౌరి వీ వగుటఁ ♦ గేవల మిందిర యైన రుక్మిణిన్
దేవిగఁ గొంటిఁ గాదె హరి? ♦ 'దొంగఁగఁబోయిన, అంతులడ్డునా'?

తే॥ గీ॥ "చాలురా చాలు, బావ మీ ♦ సలను గొఱుగఁ
గూడ," దని బలరాముండు ♦ కోప పడఁగ,
అట్టె వదలితి రెండవ ♦ తట్టు, 'సగము
పెట్టి మేనత్తవాని' య ♦ న్నట్టు కృష్ణ॥ 47

చ॥ తమిఁ దనయన్న మీస మొక ♦ తట్టునఁ బోయె నటంచు రుక్మిణీ
రమణి విచార మొంద,నది ♦ క్రిమ్మఱి వచ్చుట యెంత యంచు హా
స్యము నొనరింపవే? 'మగఁడు ♦ చచ్చె నటంచును మొత్తుకోఁగ, అం
కుమగఁడు చన్నుఁ బట్టి పిసు ♦ కుం' గద? యంగజరూప, శ్రీపతీ॥ 48

ఉ॥ దక్కక పోయె రుక్మిణి ♦ నృపాగ నటంచును జైద్యుఁ డేడ్వఁగా,
మిక్కిలి రుక్మి దుఃఖపడె ♦ మీసము దక్కక పోయెనే యటం
చక్కట! 'ఇల్లు కాలిన ద ♦ టంచు నొకం డొకప్రక్క నేడ్వ, వే
ఱొక్కఁడు చుల్ల కాలె నని ♦ యొక్కఁడ నేడ్చె' నటుల్, జనార్దనా॥

మ॥ తనభక్తిన్ దిననాథునిం దనిపి స ♦ త్రాజిత్తు మాణిక్యముం,
గొనితే, నయ్యది సత్యకెంబెదవిరం ♦ గుం గల్గుటం గోరి, దొం
గును నీ ఫ్రాఁకి తెచ్చుకొంటివి గదా! ♦ 'గూఁ దెఱ్ఱగా నున్న, గూఁ
దను దె మ్మం చడుగన్' మఱేమి యగు? నో ♦ దామోదరా, శ్రీధరా॥

తే॥ గీ॥ ఓ హృషీకేశ, 'దొంగఁగా ♦ నొప్పుకొనెదొ,
మొడ్డ కోసికొమ్మనెదో' యన్ ♦ పోల్కి సత్య
పారిజాతంబు తే కున్న ♦ ప్రాణములను
విడుతు నన్నఁ, దెచ్చితి వది ♦ పుడమి కదిర! 51

తే॥ గీ॥ తాను వేడఁగా నరకవ♦ధం బొనర్చి
తనిన మోమోటమును లేక ♦ యమరతరువుఁ
గూర్చి వజ్రి నీతోఁ బో రొ♦నర్చె కృష్ణ!
'ఒడ్డు గడవ మొడ్డను జూపు' ♦ టున్నదె గద?॥ 52

తే॥ గీ॥ గర్వమున బాణుఁ డధికుతోఁ ♦ గలను కోరు
కొనఁగ, నీచేత బాహువుల్ ♦ కూలెఁ గృష్ణ!
'గొప్పకుందొప్పికాలుచు♦కొనఁగ, వేగి
నంత కెఱుపునుమంటయు' ♦ నన్న యట్లు॥ 53

ఉ॥ "చేతులు వేయి నీ కగుట ♦ చేతనె మేటి మగండ వౌదె? పృ
థ్వీతల మం దొకించుకయు ♦ 'దెంఁగగఁ జాలని యట్టి మొడ్డె యౌ
రా! తెగ బారెఁ? డంచు విన♦వా? యని యుల్లస మాడి బాణునిన్
శాతశరాళి నొంచితివి ♦ సారసలోచన, పాపమోచనా॥ 54

చ॥ నినుఁ గని, శంఖచక్రములు ♦ నీ వలెనే ధరియించి, నీగతిం
దనకును వాసుదేవుఁ డను ♦ నామము కద్దను పౌండ్రకుం డిలన్
మును తెగటార్చె: 'నెమ్మివలె ♦ పూరుడుపిట్టయు గుడ్డు వెట్టఁ జొ
చ్చినయెడ, పూకు బ్రద్దలయి ♦ చెచ్చెఱఁ జచ్చును గాదె?' యచ్యుతా

ఉత్సాహ

బిట్టు భక్తితోడ నిన్ను ♦ భీష్మముఖులు కొలిచి క
న్నట్టి మోదమున రవంత ♦ యైనఁ దా నెఱుంగమిం,
దిట్టె సభను చేదిరాజు ♦ నిన్ బురాణపూరుషా:
'పుట్టుకుంకయే మెఱుంగు ♦ పోటునందు గల రుచిన్?'॥

శా॥ "పంతంబున్ విడు, నూఱుతప్పులును గా♦వచ్చెం జుమా; నిన్నుఁ గన్
ద్రుంతున్ నే శిశుపాల 'హేతువున కాఁ♦తుల్ పీఁకుకో, కంచెకా
యంతల్ కంతులు పుట్టుఁ'జు"మ్మని యనం♦తా, నీవె వారించినన్
గంతుల్ మానని వాని పళ్లెరమునన్ ♦ ఖండింపవే వింతగన్?॥

ఉ॥ మచ్చరమార నిన్నుఁ బలు♦మా రవమానమొనర్చు చైద్యుపై
చెచ్చెఱ పళ్లెరం బొకటి ♦ చేతను గైకొని నీవు వేయఁగా
నచ్చెరు వారఁ జచ్చెనుగ♦దా? 'గ్రహచారము చాల కున్నచో,
కచ్చను గల్గుమొద్ద భుజ♦గం బయి' చంపును గాదె శ్రీహరీ?॥

చ॥ మిగులఁగఁ గల్మి యిత్తు వని ♦ మిత్రుఁడు రాఁగ, 'కుచేల, నాకు నీ
యఁగఁగొని తెచ్చితే యడుకు?' ♦ లంచు భుజించితి వార కృష్ణ! 'ఇ
ట్లిగురుచు దెంగుచుంటి, విపు ♦ వేమియొసంగెదో'? యన్న 'మెప్పు గొ
ల్పఁగ, తలగుడ్డ యిత్తు నని ♦ భావనచేసితి,' నన్నయట్లుగన్॥ 59

ఆ॥వె॥ పిడికెఁ డడుకులిచ్చి ♦ యడుగుల నొత్తించు
కొని, కుచేలు డొందె ♦ గొప్పతనము:
'ప్రాఁత డబ్బు నిచ్చి, ♦ పత్తను జినుఁగంత్ర
దెంగు టిదె' కదా య♦నంగజనక?॥ 60

ఉ॥ అల్ల సురేంద్రఖాండవము ♦ నగ్ని దహింపఁగఁ గోరి నిన్నుఁ దాఁ
దొల్లి సమాశ్రయింప, నరు♦తోడనుసాయ మొసంగి, ఖాండవం
బెల్లను గాల్ప నీ వతని ♦ కీయఁగ లేదె యనుజ్ఞ? 'అత్తపూ
కల్లుఁడు ధార పోసె' నను ♦ నట్లుగ నాయెఁ గదా గదాధరా?॥

ఉ॥ పుట్టము లొల్వఁ బుట్టములు♦పుట్టఁగ నీ కృపచేతఁ గృష్ణ, 'కం
కెట్టులు మానభంగ మిపు ♦ డీ మెకు నే నొరింపఁ జాలుదున్?
'పెట్టిన యంత యున్న యదె ♦ పెండిలికూఁతుర,' యన్నయట్లు క
న్పట్టె,' నటంచు కౌపురఁ డు♦పాయము తోఁచక మానె శ్రీహరీ॥

ఉ॥ 'హెచ్చుగ వద్దు, పాండవుల ♦ కేవురి కొక్కొకయూరి లెక్కనే
యిచ్చినఁ జాలు కౌరవప♦తీ' యని సంధిని నీ వొనర్పఁగా
విచ్చిన ధిఃకరించి చెడె ♦ వాఁడు: 'మొదల్ చెడి మొడ్డచేతికిన్
వచ్చె నటుల్' ఘటిల్లెను ది♦వాకరవిక్రమ, యో త్రివిక్రమా॥

ఉ॥ తల్లి సహోదరుండొకఁడు♦త్వత్సుతుఁడొక్కఁడు, నైన లోకమం
దల్లరిఁ బాపఁ గంసు, నర♦కాసురుఁ, ద్రుంపవె? కృష్ణ, బంధులం
దెల్లరఁ గూల్పఁగా నరున♦కే విఁకగీతలు చెప్ప టబ్రమే?
'తల్లిని దెంగు వట్ల పిన♦తల్లియు శప్పసమానయే' సుమీ॥

ఉ॥ తాతలు తండ్రు లన్నలును♦ దమ్ములు పుత్రులు తోడివారు జా
మాత లెదుర్చుటం, 'దొలిస♦మర్తనె కూద' యను టన్న రీతిగా
చేతుల విల్లు పూనుటకె ♦ చిత్తము గొల్పని సవ్యసాచికిన్
గీత లుపన్యసించి మది ♦ ఖేదముఁ బాపితి పార్థసారథీ॥

ఉ॥ దొంగతనంబునం బసుల ♦ తోఁకలకుం బసివాండ్రి జుట్టు లం
టంగను గట్టి యల్లరి యొ♦నర్చిన నీకు నృపాలకోటిలో
సంగర ముద్భవిల్లు నటు ♦ సల్పుట క్రొత్తయె? 'సానిపాపకున్
దెంగులు నేర్పఁగా వలెనె? ♦ దీనజనావన, భవ్యజీవనా॥

తే॥గీ॥ ఈవు కురుయుద్ధమునఁ జక్రి♦మెత్త ననియు,
శాంతవుని మీఁది కెత్తవే ♦ చక్రిహస్త?
'మాటలకు నాఁతుల కభేద' ♦ మాట, మాట
యుఁటి వేమొ? నిల్పుకొన, నీ ♦ కైన వశమె?॥

శా॥ "భంగిం దెల్పెదదోణుఁ గూల్ప 'పటిస♦శ్వత్థామ,' యంచంతమా
తంగం, బ"న్మని ధర్మసూనునకు బో♦ధంజేసి, సత్యంబు మా
ర్పంగా నాతఁడు జంక, నీ నతినితో, ♦ "శాస్త్రప్రకారంబుగా
దెంగం, బుట్టును గుక్కపిల్ల" లన లే♦దే? ధూర్తగోపాలకా॥ 68

చ॥ గద గొని భీమసేనుఁడును ♦ గాండివముంగొని క్రీడి నిల్వఁగా,
కదనము నందు నీ వెపుడుఁ ♦ గాఁచెదు పాండవసేనఁ గర్ణు పాం
దొదవుటఁ జేసి గెల్పఁగ సు♦యోధనుఁ డూహయొనర్చె నద్దిరా!
ఇదె కద, 'బుడ్డ నమ్ముకొని ♦ యేటను బడ్డ విధంబు'? మాధవా॥

క॥ తొలుతటిజన్మము నందుం
జెలియ లగు సుభద్ర సతిగఁ ♦ జేకొంటి గదా
బళిర! మఱు మేన? నీకుఁ
'తల తమ్ముఁడు, గుద్ద బావ, ♦ తాండవకృష్ణా॥ 70

ఆ॥ వె॥ వనజభవుని కైన ♦ వర్ణింప రాని నీ
మహిమ యందు మూఢ ♦ మానసుండ
నెంత పొగడ నేర్తు ♦ నేఁ? 'దోమ వెంగఁగ
నెంత పాడు కాఱు ♦ నెంత?' కృష్ణ॥ 71

క॥ నా కొలఁదిమది ననంతం
బై కన్పడు నీదు మహిమ ♦ నంతయు నిలుపం
జేకుఱునె, 'పిల్లిపూఁకున
ఆఁకటినిందూర్చి' నట్టి ♦ రూపునఁగృష్ణా?॥ 72

ఉ॥ ఆద్యుఁడ, విశ్వ రేశ్వరుఁడ, ♦ వ త్యధికుండవు, నిన్ను గొల్వ బ్ర
హ్మాద్యమరాళి నేర్వ; రటు ♦ లయ్యును బూర్ణముగానిభక్తితో
ఉద్యమ మే నొనర్చితిని ♦ నుల్లము నీకిడ, 'గొల్లి గిల్లి నై
వేద్యము పెట్టినట్టు' లర ♦ విందదళాక్ష యెటుల్ గ్రహించెదో?॥

క॥ ఘనుఁడ వగు నీకు నే మది
ననఘుంబును సల్ప సేవ ♦ యల్ప మయినఁ, గై
కొనుమా, 'కొం డంతటి దే
వునకుఁ జిసిం డంతపత్రి ♦ పోల్కని కృష్ణా॥ 74

చ॥ కమలదళాక్ష, నీ పయిని ♦ కాంక్ష మదీయమనోబ్జప్రసూ
నము నిపుడే సమర్పణ మొ ♦ నర్పఁగ వచ్చితిఁ; బాపవాంఛిత
భ్రమరసమాకులం బగుటఁ ♦ బట్టి గ్రహింపఁగ మానె దేమొ? 'పు
ణ్యమునకుఁ బోఁకొనంగు నెడ, ♦ నాఁతులు గల్గుట కల్గి నట్లు గా'॥

కం॥ ఆత్మ నొసఁగు వారికి పర
మాత్మా! మోక్ష మని నీకు ♦ నర్పించితి నా
యాత్మను: 'హాత్మే పైసా
చూత్మే లవడా' య టన్న ♦ చొప్పిదియె కదా?॥ 76

కం॥ చేతమున దైవభక్తి ప్ర
భూతం బగువేళ నిన్నుఁ ♦ బోలినదైవం
బీతఱి నాకు లభించుట,
'ఆఁతులలోఁ దేనెపట్టి ♦ న' ట్లయ్యె హరీ॥ 77

తే॥ గీ॥ ఎన్నఁడో నీ పదధ్యాన ♦ మేను సలుపు
చున్న, ప్రతినిమిషంబును ♦ నన్నుఁ బ్రోవ
డాయ ర మ్మందు: 'ఇచ్చుట ♦ డబ్బు గాని,
ద్రొబ్బు టొక జాము నరయు,' నో ♦ తోయజాక్ష॥ 78

కం॥ దానతపోజపములు, నె
మ్మనిపవిత్రిత, 'యుపస్థ ♦ మినహా కన్యా
దానంబు' రీతి వ్యర్థము
లే, నీ పదభక్తి లేని♦యెడలన్ గృష్ణా॥ 79

మ॥ జను లీ లోకపుఁ దుచ్ఛసౌఖ్యముల ని♦చ్ఛం గోరి లుచ్ఛాపప్రిన
ర్తను లై నిన్ మఱువంగ, వారలకు నం♦తం బంము రా కుండఁ ద
ప్పును జు మ్మక్షయమోక్షసౌఖ్యచయముల్;♦ మూర్ఖోళికింబూకునా
కిన ముప్పావల కమ్మి చిక్కుపడు' భం♦గిన్ దేవకీనందనా॥ 80

తే॥ గీ॥ నీదు సేవచే నాకు జ♦నించుపుణ్య
గణము చెడుఁ, జెడుకోర్కెలఁ ♦ గలిగెడిఁ దురి
తములచే, 'అవ్వ తీయు గం♦ధంబు తాత
బుడ్డకున్ సరి' యనియెడి ♦ పోల్కిఁ గృష్ణ॥ 81

ఉ॥ అనుపమతావకాంఘ్రియుగ♦ళాధికచింతనఁ బాపబుద్ధి నె
మ్మనమునఁ బుట్ట; దట్లయిన, ♦ మామకచిత్త మఘౌఘ మందునే
మునిఁగెను, 'గొడ్డుపోతునకు ♦ మొద్దులు దండుగ యన్న యట్టిరీ
తిని:' పురుషోత్తమా, నను మ♦దిం గరుణించి, యఘాళిఁ బాపవే॥

మ॥ "ఇది నా యింద్రియవర్గమట్లగుటచే,♦ స్వేచ్ఛన్ మెలంగింతు,"నం
చుఁ దలంపంగను, బాపురే! 'విహితుఁ డం♦చున్ వీఁపు నెక్కించుకొ
న్న, దిగం జాఱుచు గుద్ద దెంగె' నను చం♦దానన్ బడంద్రోసె న
న్మదతన్ నన్నీ మదింద్రియంబులు: ముకుం♦దా, రమ్ము కుందార్పఁగన్

—♦ స్వగ్విణి. ♦—

దెంగుచున్నన్, సదా ♦ దెంగుటే; మాని వే
యంగ, లింగండు తె♦య్యంచు లోంగం: డిఁకే
భంగిగా నిల్చు నీ ♦ పైని నా యాత్మ? నే
'దెంగనా, మాననా, ♦ దేవకీనందనా?'॥

క॥ ఏటికి నినుఁ దలఁపఁగ నఘ
కోటిః దొలఁతు ననెడుబిరుదు ♦ గొంటి వయో!'వా
మోటమునకుఁ బోవఁగఁ, గడు
పో' తెలుఁగవె? పాప వేమ ♦ దఘములఁ జక్రి? 85

మ॥ భవబంధంబుల యందుఁ జిక్కువడి నేఁ♦ బాపంబులం జేసినన్
భవదీయాశ్రితరక్షణత్వబిరుదే ♦ పాడై చనన్ "వీఁడు పా
పివిశేషంబుగ," నంచు వీడకుమి నన్, ♦ 'పెండ్లాముపైఁ గోపము
దృవిలన్ చుల్లను గోసికొన్నటు,' యశో♦దా, శ్రీయశోదాత్మజా

ఆ॥ వె॥ 'గుడ్డివాని కెపుడు ♦ మొడ్డమీఁదనె లోక'
మెటులొ, యటులె జ్ఞాన♦దృష్టి లేని
నాకుఁ బాపమందె ♦ లోక మయ్యాంబికే
యునికిఁ బోలెఁజూపు ♦ నొసఁగుఁ గృష్ణ॥ 89

## —♦ ర త్నా వ ళి. ♦—

యాదవవంశవార్ధిచంద్ర, చంద్రాభనిర్మలయశస్సాంద్ర,
నాదు మానసంబునఁ బుట్టిన యజ్ఞానము పోవుట దుర్లభమా,
'గూదకు రాసిన యారికతవ్వుడుఁ గుంజినఁ వదల' దనురీతిఁ:
నీ దయాప్రవాహమున నెపుడు నానిచి, యేగతిఁ దొలఁగించెదవో?

ఉ॥ చాల నఘాళి నామనము ♦ సల్పఁ దొడంగఁగ, నింద్రియంబులున్
వీలగు నంతఁ దోడుపడి ♦ వెంటనె వర్తిలుః ‹ఉత్తమంపుటి
ల్లా లెపు డైన నూరువెడ♦లంగనె, యూరిని గల్గు చుల్లల
బ్బాలకు సారికావడుల' ♦ భంగిని వచ్చును గాదె యచ్యుతా?॥

ఆ॥వె॥ ఒడలు సోమరితన ♦ మొందింప మదిపాప
చింత గొలుప, నీదు ♦ సేవ మఱతు
‹కుక్క గూద పట్టు♦కొని లాగ, అత్తయు
సిగను బట్టి లాగు ♦ పగిదిఁ గృష్ణ॥ 90

ఉ॥ 'అంబుజనాభు నందు మన♦మా, వినయంబునుబూను,'మన్న 'స
త్యంబుగ ధూర్తలక్షణము'♦ దంచును బూనదు డెంద, మేమిక
ర్మం బొకొ?'సాదు ముత్తాగర స♦మాదిగ'యన్న ‹సహించదమ్మ'యాం
బం బొనరించు,' న స్నటుఃకృ♦పఁ వినయంబొనఁగూర్పుశ్రీహరీ॥

శా॥ ఊహాతీతము నీ మహత్త్వ, మది య♦త్యుత్కృష్టమే యైననుఁ
సాహంకారులు దేవతాధముల మా♦హాత్మ్యంబె వర్ణింతు రెం
తే హర్షంబున! ‹మాచకమ్మ చనుదో♦యిం గాంచి సన్యాసిగాఁ
డాహా! చంకలు గ్రుడ్డు కొన్నగతి' స♦త్యాచిత్తనిత్యప్రియా॥ 92

తే॥గీ॥ నీకు నన్యదైవతముల ♦ కే కరణిని
బోల్కి గలుగంగ నేర్చును? ♦ 'బూతుపిల్లి
గడ్డకుఁ మఱి గాడిద ♦ మొడ్డకు నెటు
సామ్యమగు' వార్ధిశయన, యో ♦ జలజనయన॥ 93

ఉ॥ ఇచ్చును గోరు వాంఛితము ♦ లెల్లను దైవతధేను వట్లుగా
నిచ్చలు నిచ్చు నిన్ విడిచి, ♦ నీచులు పైఁ బడి బాధపెట్టఁగాఁ
జొచ్చెడి క్షుద్రదేవతలఁ ♦ జూచి భజించెద రో ముకుంద, 'పా
లిచ్చెడి యావు నమ్మి పయి ♦ కెక్కుచు డెంగెడి యెద్దుఁ గొన్నటుల్'

ఆ॥ వె॥ అతనుజనక, పాప ♦ తతిఁ బాపుకొన నీదు
సేవ లేదె; క్షుద్ర ♦ దేవసేవఁ
గాసిలంగ నేల? ♦ 'కత్తి లేదే, యాక
కొఱకు పూకు కాల్చు ♦ కొనఁగ' నేల?॥ 95

తే॥ గీ॥ దేవదేవ, 'చిన్నాలును ♦ లేవు, పాతి
కలును లేవు, సిండను నీళ్లె ♦ కాఱె' నన్న
భంగి క్షుద్రదైవములఁ గొ ♦ ల్వంగ ముక్తి
యీరు, సిరి యీరు, మదిక్షోభ ♦ యే ఫలంబు॥ 96

ఉ॥ ఏ కడ నేని రౌద్రగుణ ♦ మే వహియించిన క్షుద్రదేవతా
నీకములన్ భజించినను ♦ నిక్కముగాఁ దమ రౌద్రభావమే
కాక మ ఱేమి చూపుదురు? ♦ కంసవిమర్దన, యో జనార్దనా,
'పూకునుబూజసేయుటకుఁ ♦ బోయిన, నిత్తునె చూపు' నత్తఱిన్॥

చ॥ అసదృశసత్కృపన్ శ్రితజ ♦ నాళిని బ్రోచెడి నీకు స్వల్పపూ
జ సలుపఁ, దృప్తి గాంతు; వుప ♦ చారశతంబుల క్షుద్రదేవతల్
పిసరును సంతసంపడరు: ♦ 'పెట్టని పోయని యమ్మగండె పి
త్తసిరుగ డెంగుచుండును' గ ♦ దా? మురళీధర, రామసోదరా॥

క॥ నిను నమ్మితిఁ గావున, నా
మనమున సుగుణములకొఱకు ♦ మాటికి వెదుకం
జన దో కౌస్తుభధర, యా
'స్తనశల్యపరీక్ష' కాఁగఁ ♦ జాలదు సుమ్మీ॥ 99

ఉ॥ నా మన సెట్టి దుర్గుణగ
ణంబులతోడను నిండి యున్న, న
న్నోమెడు లక్ష్మి నీవుc, దన
యుం దలిదండ్రులు వోలె నెంతయుం
బ్రేము; ననారతంబు మిము
వీడక యుండెదc 'దుక్కు టింకి' నా
స్వామి, నృసింహా, పుణ్యపురు
షా, యదుసింహా, దయాపయోనిధీ॥

నరసోక్తి యుక్త

# కృ ష్ణ శ త క ము .

స ం పూ ర్ణ ము.

45

# రసికాభిలాషము.





గ్రంథకర్త,

కవిసార్వభౌమ

శ్రీనాథుఁడు.

# పీఠిక.

పూర్వ కవీంద్రులచే రచింపఁ బడిన గ్రంథము లింక నెన్ని యెన్ని యెక్కడ నెక్కడ నడఁగి యున్నవో యెవరి కెఱుక! ఈ వైశాఖమాసమున మా బంధువులలో నొకరియింటనైన వివాహమునకు సింహాచలపుటడివారమునకుఁ బోయి యుండి యక్కడ నొక శ్రీవైష్ణవ గృహస్థునింటఁ బ్రాఁతతాటియాకుఁ బొత్తములను దిరుగ వేయుచుండ నాకు "రసికాభిలాష"మను నీచిన్నిపొత్తము లభించినది. కవియెవరో తెలియక "వీధినాటకము" కూడ దీనితోఁ గలసి యున్నందున శ్రీనాథుఁడా యని యనుమానించి, కవితాశైలియుఁ గల్పనాప్రౌఢియు శృంగారరసవిస్తరతయు నాయనుమానమును బలపఱుపఁగాఁ జివరను జూచి, గద్యము లేక పోయినను దుది పద్యము చక్రబంధమగుటఁ బోల్చి, యందు "శృంగార శ్రీనాథ" యను పేరేర్పడుటచే శ్రీనాథుని గ్రంథమే యని సిద్ధాంతము చేసితిని. గ్రంథ మంతయు సావకాశముగాఁ జదివిన వెనుక 38, 39 వ పద్యములవలన మిగిలిన కొంచెము సంశయమును నిర్మూలమైనది. శృంగార మన్న విషప్రాయముగాఁ జూడవలయు నని చెప్పు నిప్పటియాంధ్రులకు శృంగార భూయిష్ఠ మగు నీపుస్తకము రుచింపమి విదితమే కావున దీనిని బ్రచురింపఁగూడ దని మొదట నిశ్చయించినను, శ్రీనాథకవి యంతటివాని గ్రంథముల లోకమున వెల్లడిచేయుటకుఁ జేయక పోవుటకు నొకరి యిష్టము కాదని తలఁచి తుదకుఁ బ్రచురింప నిశ్చయించి విశాఖపట్టణమునందలి శ్రీశారదామకుటముద్రాక్షరశాలాధికారులగు మ. రా. రా. విన్నకోట అప్పల నరసింహ శాస్త్రిగారికి జూప వారు దానిని దామే ప్రచురింపఁ గోరి తీసికొనిరి. దీనిని నవీన కవియే యొకఁడు రచించి ప్రచురించినచో విమర్శకు లెట్లు దూషించి యుందురో దేవునికే తెలియును!

శ్రీనాథుని వీధినాటకము లోకమునఁ బ్రచుర మయ్యు నీరసికాభిలాష ము కానందులకుఁ గారణము లేక పోలేదు ఇందుఁ గవి యుద్దేశించిన నాయిక గొప్ప రాజులయింటి దనుట నిశ్చయము. 3వ పద్యము నందలి "యందని మ్రానిపండు" వను మాటయు, 49వ పద్యమునందలి "భోగినీముదిత" యనుమాటయు దానికి నిదర్శనములు. శ్రీనాథుని కీకోరిక తీరినట్లు కాని తీఱు నను నాస యున్నట్లు కాని యెక్కడను గనఁ బడదు. ఈమె యెవతెయో! యెక్కడిదో? కన్యకాదని 2'వ పద్యమునందలి "పరకాంత నైన" నను మాటయుఁ, జారచింత గల దని 19 వ పద్యమునందలి "భుజంగుల పాలా" నను మాటయుఁ దెల్పుచున్నవి. రసికుఁడగు శ్రీనాథుని యభిలాష మే మయ్యెనో!

"కవిసార్వభౌముఁ" డని సార్థకబిరుదము గాంచిన శ్రీనాథుని కవిత్వముఁ గూర్చి నే నిక్కడ వేఱుగాఁ జర్చింప వలసిన యవసరము లేదు. అయినఁ గవి దీని నెట్టి వయసున వ్రాసినాఁడో యాలోచింపవలసి యున్నది. ఈతఁడు యౌవన దశను స్త్రీలోలుఁడై విచ్చలవిడి దిరిగెనని చెప్పుదురు. ఆకాలముననే వీధినాటకము నందలి పద్యములఁ జెప్పెననియు వాడుక. రసికాభిలాషము కూడ నప్పటిదే యయినచో నది "నూనూఁగు మీసాల నూత్నయౌవనమున"నే విరచింపఁబడియుండును అయిన నొక్క బాధక మున్నది. 39వ పద్యమునఁ "గవిసార్వభౌమ" పదము వాడఁ బడి యున్నది. ఈబిరుదము శృంగారనైషధము వ్రాసిన వెనకనే యీతనికి "రాయలయొద్దఁ బాదుకొల్ప" బడినట్లు విందుము. ఈ పద్యము తరువాతఁ గలుపఁ బడిన దేమో!

రసికాభిలాషమున శ్రీనాథుఁడు తెచ్చిన కల్పనలను గొన్నిటిని బూర్వకవులలోఁ గొంద ఱిటీవల నుపయోగించిరి. అందుచేత వారిలోఁ గొందఱియొద్దనైన నీ గ్రంథ ముండెనని తోఁచుచున్నది. ఎందఱు శ్రీనాథుని కల్పనల దొంగిలించిరో, యెందఱికిఁ గ్రొత్తగా నాతనియూహ లే తట్టినవో చదువరులే నిర్ణయించుటకు వాని నిక్కడఁ జూపించుచున్నాను.

i కూచిమంచి తిమ్మకవి నడివీధిలోఁ గౌఁగిలించిన వృద్ధవేశ్య

" చ. చతురులలోన నెంతయును ♦ జాణ వటంచును నేను గౌఁగిలిం
చితి, విటు మాఱుమో మిడఁగ ♦ జెల్లునె యోరసికావతంస!"

యన్నప్పుడు

" అ
ద్భుత మగునట్టి బంగరపు ♦ బొంగరపుంగవఁ బోలు నీకుచ
ద్వితయము బొమ్మనాటి యల ♦ వీఁపున దూసె నటంచుఁ జూచితిఁ"

అన్న వ్రీతి వచనముయొక్క సమయస్ఫూర్తి యెంతయు గదా! ఇందలి 29వ పద్యముఁ జూడుఁడు.

ii తాను బ్రక్కను జేరఁగా మొగముఁ ద్రిప్పి పన్నుండిన వేశ్యఁ గూర్చి రాములింగఁడన్న

"మ. పరబింబాధరముం బయోధరములు ♦ న్వక్త్రాలకంబు ల్మనో
హరలోలాక్షులు చూప కవ్వలి మొగం ♦ బైనంత నే మాయె నీ
గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మా ♦ కుంజాలవే? 'గంగక
ద్దరి మే లిద్దరిఁ గీడు నుం గలదె?' యం ♦ ద్యద్రాజబింబాననా!"

అను పద్యమందలి భావము దీనిలోని 40వ పద్యములోనిదే. ఇందు "సౌందర్య గంగాఝరి" యని చెప్పి యందుల కనుగుణ్యముగా భావమంతయు నడుపుట విశేషము.

iii "సీ. బింబోష్ఠి యని నీవు ♦ పెనఁగ రాకు కురంబ!
సారసగంధి యీ ♦ పంకజాక్షి"

యను రసికజనమనోభిరామమునందలి పద్యము చాలవఱకిందలి 8 వ పద్యమును బోలును.

iv రంభాద్యప్సరస కాంతలనామములు దారాశశాంకాది ప్రబంధముల శ్లేషింపఁ బడుటకుఁ బూర్వమే యిందలి 46వ పద్యమున నట్లుపయోగింపఁబడినవి.

v మనుచరిత్రములోని "మీటినయంత విచ్చు చనుమిట్ట" లను మాటయు విజయవిలాసములోని "మీటిన విచ్చు చనుదోయి" యనుమాటయు గ్రొత్తవి కావని యిందలి 16 వ పద్యము తెలుపును.

vi అటులనే 'జగతి నెంకటి యుపకారి కంబరారి!' యన్న విజయవిలాస పద్యభాగము దీనిలోని 11వ పద్యమున నున్న "యుపకారియగుంగద కంబరారి!" యను దానిని జూచి వ్రాయఁ బడినదా యనిపించును.

నాకు లభించిన ప్రతి మిగులఁ బ్రాఁత దైనందునఁ గొన్నియెడలఁ జినిఁగి పోయినది అట్టిచోటులఁ బోయిన మాటలను నేనే పూరించితిని. అట్లు కలుపఁ బడిన భాగము లేవో శ్రీనాథవిరచితభాగము లేవో శైలులవలన దెలియుట సులభము గాన వానిని వేఱు వేఱుగాఁ జూపలేదు.

దీని ప్రతి మఱియెవ్వరియొద్దనైన నున్నచో నాకుఁ బంపినయెడల రెండవ కూర్పునందైన నిందలిలోపముల సవరింతును,

విశాఖపట్టణము,
1వ ఆగష్టు 1905

సెట్టి లక్ష్మీనరసింహము, బి, ఏ,
రుక్మిణీ కల్యాణ నాటక గ్రంథకర్త,
మిస్సెస్సేవియక్ కాలేజిలో నుపాధ్యాయుఁడు,

# మనోరమ.

ఆగష్టునెల 1907 — రాజమహేంద్రవరము.

## కృతివిమర్శనము.

రసికాభిలాషము— ఇది యొక్కటే యాశ్వాసముగల చిన్నప్రబంధము. ఈపుస్తకము విశాఖపట్టణనివాసులు రుక్మిణీకల్యాణనాటకగ్రంథకర్తలు పట్టపరీక్ష యందుఁ గృతార్థులు నగు మ. రా. శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి పీఠికతో విస్సకోట అప్పలనరసయ్య శాస్త్రిగారి శారదామకుటముద్రాక్షరశాలలో ముద్రితమయి ప్రకటింపఁబడియె. ఆసెట్టి లక్ష్మీనరసింహముగారు కడచిన వేసఁగి సెలవులలో బంధువులయింట వివాహము నిమిత్తము సింహాచలపుటడివారమునకుఁ బోయి యుండగా నక్కడ నొక శ్రీవైష్ణవుని గృహములో నీపుస్తకము వారికి లభించినదఁట. ఈగ్రంథము శ్రీనాథుని వీధినాటకముతోఁ గలసి యొక్కతాటియాకుల పుస్తకముమీఁద వ్రాయఁబడి యుండుటచేతను గ్రంథాంతమున చక్రబంధపద్యమునందు శృంగారశ్రీనాథ యనునామము గనంబడుటచేతను గవిత్వము కల్పనలు రసవంతములుగ నుండుటచేతను గద్యలేకపోయినను శృంగారనైషధము, కాశీఖండము, భీమఖండము, హరవిలాసము రచియించిన మహాకవి శ్రీనాథుఁడే దీనిని రచియించెనని యాలక్ష్మీనరసింహముగారు పీఠికలో సిద్ధాంతముచేసిరి. కాని యా సిద్ధాంతము మా కంత యుక్తియుక్తముగఁ గనఁబడలేదు.

మే మెన్నిసారులు వారిపీఠికను మూలగ్రంథమును శ్రద్ధతోఁ జదివినను శ్రీనాథుఁ డీగ్రంథమును రచియించియుండఁ డనియు విషయాసక్తుఁడయి పడుచుతనపు గర్వముచేత నోడ లెఱుఁగక తిరుగుధూర్తవిటుఁ డెవ్వఁడో తనదుష్పాండిత్యము మెఱయ నీపద్యముల నల్లియుండవచ్చుననియు మాకుందోఁచుచున్నది. ఇట్లు మాకుందోఁచుటకుఁ గల కారణములఁ గొన్నింటి నీక్రింద నుదాహరించుచున్నారము. గ్రంథాంతము నందు గద్యముగాని గ్రంథారంభమునందు కవివంశాదులు కాని లేవుగదా? అందుచేత మన మూహాలు చేసి కవిపేరు కనుగొనవలయు ననుట స్పష్టము. చివర చక్రబంధములో నేర్పడు శృంగార శ్రీనాథ పదముల చేత శ్రీనాథుఁడే గ్రంథకర్తయని మన మూహింపఁదగదా? ఆట్లూహింపఁ వీలులేదు. శ్రీనాథునకు శృంగార శ్రీనాథుఁ డని యెక్కడను ప్రసిద్ధిలేదు. శృంగారమువారు శృంగారకవివారు తెనుఁగుదేశమందు వైష్ణవులలోను నద్వైతులలోను ననేకు లున్నారు. వారిలో నెవరయిన శ్రీనాథనామము గలవాఁడొకఁడుండవచ్చును. అతఁడే తనదురభిలాషను బద్యరూపకముగాఁ బయికి వెల్లడించి

యుండవచ్చును. అంతియేకాని కమలనాభామాత్యపౌత్రుఁడు, మారయామాత్యపుత్రుఁడు, నగు మహాకవి శ్రీనాథుఁ డీగ్రంథకర్త కాఁడు. అదిగాక శ్రీనాథుని గ్రంథము లన్నిటినుండి తనలక్షణగ్రంథమునకు లక్ష్యపద్యములను దీసికొనిన యప్పకవిగాని కూచిమంచి తిమ్మనామాత్యుఁడుగాని యడిదము సూరకవిగాని మఱి యితరలాక్షణికు లెవ్వరు గాని యీగ్రంథము పే రయినఁ దలపెట్టకుండుటకుఁ గారణ మేమి? ప్రాచీనమహాకవుల కెవ్వరికిం దెలియని యీగ్రంథము నేఁడు క్రొత్తగా శ్రీనాథునిదని యొకరు చెప్పినంతమాత్రమున జను లొప్పుకొనవచ్చునా?

ఆకారణముల నటుండనిచ్చి యిందు వర్ణింపఁబడిన యంశమును విచారింతము. ఒక రసికుఁడు వివాహితయయి భర్తతోఁ గాపురము చేయుచున్న యొక కులకాంతను మోహించి నఖశిఖపర్యంత మామె సకలావయవముల వర్ణించి యామెతోఁ గూడినట్లు స్వప్నములఁ గాంచి యాస్వప్నములఁ దలంచుకొనుచు విరహతాపము నొందుచు నామె చక్కఁదనముఁ దలంచి యూట లూరుచుండుటయే యిందలి కథాంశము. పరకాంత, కన్యయైనఁగాదు, వేరొకనిభార్యయగు దానిని వలచి, వలచినందుకు సిగ్గుపడక పైపెచ్చు బూతుపద్యముల వ్రాసి శ్రీనాథుఁడు విరహతాపము పొందెనని చెప్పుట పరమభాగవతోత్తముఁడు నైష్ఠికుఁడు నగు శ్రీనాథునికీర్తి పాడుచేయుట. శ్రీనాథున కేగాదు. ఈపద్యములు తనవని యెవఁడు చెప్పుకొనునో వాని కప్రతిష్ఠయేగాని ప్రతిష్ఠ రాదు. అందుచేతనే కవి గ్రంథమునందు మొదటనైనం జివరనైన తనపేరు విస్పష్టముగ వేసికొనుటకు సిగ్గుపడియెను. మఱియుఁ జంద్రబంధమునందున్న శృంగార శ్రీనాథపదములు కేవల మొకపురుషనామమును దెలియఁజేయవు శృంగార శ్రీయనఁగా శృంగారలక్ష్మి దానికి నాథుఁడు శృంగార శ్రీనాథుఁడు గ్రంథము దుర్నీతిబోధకమగుటచేతనో మఱియొందుచేతనో కవి గద్య వేసికొనుట మానినప్పుడు తనపేరు వేఱువిధముగాఁ దెలియఁజేసికొనుట కిష్టపడునా? ఇష్టపడకపోవుటచేతనే తానొక శృంగారనాయకుఁడ ననుమాట మాత్రము సూచించెను. అందుచే నది యొక మనుష్యునిపేరుగా గ్రహించుటకు వీలులేదు. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమ బిరుద మున్నదనియు నాబిరుద మిందుఁ బ్రయోగింపఁబడుటచే నతఁడే దీనిని రచించెననియుఁ టీకలో వ్రాయబడినది. కవిసార్వభౌమబిరుదమ నేకులకుఁ గలదు. కూచిమంచి తిమ్మనామాత్యునకు లేదా? ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవీశ్వరుఁడ ననియుఁ గవిసార్వభౌముఁడ ననియుఁ బుస్తకములలో బ్రయోగించుకొనుచుండును. కావున కర్తృత్వము శ్రీనాథున కారోపించుట కదియొక కారణముగాదు.

ఇంక పద్యములశైలియుఁ గవిత్వచాతుర్యము నించుక శోధించిచూతము. కల్పన లెక్కడనోగాని తఱచుగాఁ బ్రౌఢములుగా లేవు. శైలియు శ్రీనాథుని శైలితో

కొంతమాత్రముం బోలదు. శ్రీనాథుని గడుసుతనపు ప్రౌఢిమలిం దెక్కడను గాన
రావు. అదియునుం గాక యీగ్రంథ మాధునికుఁ డెవ్వఁడో రచియించెనని స్పష్ట
ముగ చెప్పుటకు తగిన యుదాహరణములు కొన్ని కానఁబడుచున్నవి పదునేనవ
పద్యమునందు "తయారులోనె తగు" ననుపద మున్నది. తయారన్నది తురక మాట
గాని తెలుఁగుమాట కాదు. ప్రాచీనకవు లెవ్వరును ముఖ్యముగ శ్రీనాథుఁడు
నిట్టి పదముం బ్రయోగించినట్లు లేదు, ఇట్లే నలువదిమూడవ పద్యమున 'ఖైదుగ
బాహుపాశములఁ గట్టవె' అని యున్నది, ఇదియును శ్రీనాథాది ప్రాచీనులు
ప్రయోగింపని హిందూస్తానీ పదమే, పందొమ్మిదవ పద్యమునందు 'నాకుఁగూడ
నాభాగ్యమెట్టుల నేనాఁటికి గల్గునో' యనియున్నది. 'నాకుఁగూడ' ఇట్టి ప్రయో
గము లాధునికుల గ్రంథములలోనే గాని ప్రాచీనులగ్రంథమునందుఁ గానఁబడవు.
ఇందు 'గూడ' యను పదము సముచ్చయార్థ మగు 'ను' వర్ణకమునకు బదులుగ
నాధునికులు ప్రయోగించుచున్నారు, ముప్పదినాలుగవ పద్యములో 'లజ్జిలినాఁటు'
యని యున్నది. 'లజ్జిలినాఁడ' నని యుండవలయును గాని 'నాను' యని యుం
డుట యసాధువు. ఇట్లు శ్రీనాథుఁడు ప్రయోగింపఁడు. ఈపుస్తకమునందలి
యేఁబదిపద్యములలో నిట్టివింకం గొన్ని యున్నవి. గ్రంథవిస్తరభీతిచేత నిచట
నుదాహరింపక యుంటిమి. పూర్వోదాహృతము లయిన ప్రయోగములం బట్టి
చూడ నీగ్రంథ మెవఁడో నవీనుఁడు రచియించి యుండవచ్చునుఁ గాని శ్రీనా
థాదులగు ప్రాచీను లెవ్వరును రచియించి యుండరనిసయుక్తము తోఁచుచున్నది.
సెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసినపీఠికలో 'శృంగార మన్న విమప్రాయముగఁ
జూడవలయునని చెప్పు నిప్పటి యాంధ్రులకు శృంగారభూయిష్టమగు నీపుస్త
కము రుచింపమి విదితమే' యని యొక చోటను, 'దీనిని నవీనకవియే యొకఁడు
రచియించి ప్రచురించినచో విమర్శకు లెట్లు దూషించియుందురో దేవునికే
తెలియు' నని వేరొక చోటను వ్రాసిరి. ఈనాటియాంధ్రులలో నెవ్వరు శృంగార
మన్న విమప్రాయముగ జూచుటలేదు. శృంగారము పేరుపెట్టి యిచ్చవచ్చిన
పచ్చిబూతులు వ్రాసినవారి కబ్బముల నీనాటివారు విమప్రాయములుగ జూచు
చున్న మాట నిశ్చయమే. శృంగారరసమునకు నాగరికులు జదువ సిగ్గుపడు
మృదువు దప్పిన వాక్యమునకు భేదము తెలిసికొనలేక యీలక్ష్మీనరసింహముగా
రిట్టి పెట్టివ్రాతలు వ్రాసినందుకు మేము తద్దయు విచారించుచున్నారము. కాళి
దాసాదులగు సంస్కృతకవులు కవిత్రయమువారు పింగళిసూరన్న మొదలగు
తెలుఁగుకవులు శృంగారరసము వర్ణింపలేదా? ఆశృంగారరసము నీనాటియాంధ్రు
లాదరించుట లేదా? పురుషులయినం జదివి తలవంచుకొనవలసిన బండబూతులు
గల పద్యములలోని రసము శృంగారరసము గానేరదు. ఇట్టి గ్రంథముల నాద
రించుట నాంధ్రభూమిలో విమర్శకులఁ జెంచుట. ప్రాచీనులు రచియించి

వంతమాత్రమున నిది వంద్యముగాదు. నవీనులు రచించినచో నింద్యముగాదు. బూతులెప్పుడు నాగరికదూష్యములే యగును. సెట్టి లక్ష్మీనరసింహముగారు తాము పీఠికలో వ్రాసినయుక్తులపరిహారము లనుకొని శ్రీనాథుఁడే యీగ్రంథ కర్తయని సిద్ధాంతముచేసి తెనాలిరామకృష్ణుఁడు, చేమకూర వేంకటకవి, కూచి మంచి తిమ్మకవి, ఆంధ్రకవితాపితామహుఁడు మొదలగు మహాకవు లందఱు నేఁబదిపద్యములకంటె నెక్కువలేని యీబూతుల ప్రబంధములోనుండి కొన్ని కల్పనల దొంగిలించినా రని వ్రాయసాహసించిరి. ఈగ్రంథము మూల నడఁగ ద్రొక్కక ప్రకటించిన సాహసముగాక యీసాహసములు గూడ నేలవలయునో తెలియకున్నది. ఆమహాకవు లీగ్రంథమునుండి దొంగిలించినా రనుటకంటె నవీనుఁ డెవ్వఁడో యీగ్రంథము రచించి మంచికల్పనలు తోఁపమి నీగ్రంథచౌర్యమును జేసి యుండు నన్న బాగుండును. గ్రంథము ప్రాఁత దగుటచేఁ గొన్ని తావుల యందు శిథిలము కాఁగా సెట్టి లక్ష్మీనరసింహముగా రక్కడక్కడ నాయాభాగ ములు తాను బూరించితి ననియు, శైలులందలి భేదములు తెలియును గనుక నట్టి భాగములకు గుర్తులు వ్రాయలేదని పీఠికలో తెల్పియుండిరి. మాబుద్ధికిఁ జూడ గ్రంథమం దంతట నొక్క శైలియే కనఁబడుచున్నదిగాని వేర్వేఱు శైలులు కనఁ బడుట లేదు. కవిత్వశైలిం దెలుపుట కిం దుదాహరింపవలసిన హృద్యమయినపద్య ములు లేకుండుటచే మానితిమి.



# ప్రతివిమర్శనము.

రసికాభిలాషము — శ్రీమనోరమాపత్రిక 1907 సం||రం ఆగష్టునెల సంచికలో నీప్రబంధమును గూర్చి వ్రాయఁబడినవిమర్శనమందు శృంగారనైషధాదుల రచియించిన మహాకవి శ్రీనాథుఁ డీరసికాభిలాషము రచియింప లేదని వాదింపఁబడినది. అందుల కీఁబడిన హేతువు లెంతయు యుక్తియుక్తములో యీదిగువ విమర్శింప బడు చున్నవి.

i చివరి చక్రబంధములో శృంగారశ్రీనాథనామ మేర్పడు చున్నను, మారయామాత్యపుత్త్రుఁడగుశ్రీనాథునికి శృంగారశ్రీనాథుఁ డనుప్రసిద్ధిలేదు గనుక నీతఁడు వేఱుకవి యఁట! చక్రబంధములో నాఱేకుముల నామమే యిముడ్ప వలయును గాని యంత కంటె నెక్కువగాఁ గాని తక్కువగాఁ గాని వలను పడ దనుట బంధకవిత్వము చేయువారి కందఱకుఁ దెలిసినవిషయమే. కావున శ్రీనాథ పదమునకు ముందు మూఁడక్షరములు చేర్పఁబడవలయును. నైషధమునకు శృంగార నైషధ మని పేరుపెట్టియుండుటచే శ్రీనాథునికి శృంగారపదము మిగుల నభిమానమైనదని స్పష్టము గదా! అదిగాక తానువ్రాయుచున్నది శృంగారభూయిష్ఠము; తానొకప్రసిద్ధుఁడగుశృంగారనాయకుఁడు. అందుచేత "శృంగారశ్రీనాథ" మని వాడి యుండఁ గూడదా? కొన్నికారణములవలన శృంగారనైషధగ్రంథకర్తయే రసికాభిలాషగ్రంథకర్త యని తేలుచున్న యెడల "శృంగార" శబ్దమున్నదన్న హేతువుచేతనే యనుమానించుట తగునా? "శృంగారశ్రీనాథ" పదమునకు శృంగారశ్రీకి నాథుఁడు, శృంగారనాయకుఁడు, అని యర్థము స్ఫురించు చున్నదని విమర్శనమందు సెల వీఁబడినది. అట్లు తననామమును శ్లేషించుటయే శ్రీనాథుని యభిప్రాయ మేమో! అట్లయి గ్రంథమునకు శ్రీనాథప్రణీతము మాత్రమే యని కాక ముఖపత్రముమీఁద "శృంగారశ్రీనాథప్రణీత" మని యచ్చొత్తింపఁ బడినది. అది విమర్శకులు తిలకించిరా? కారణ మేమని యూహించిరి? లేక తెనుఁగుదేశము లోని శృంగారమువారు శృంగారకవివారు మొదలగునింటిపేరులవారిని వైష్ణవుల యందు నద్వైతులయందు నిదివఱకుఁ గూడ నుండినందున వీరికి ముఖపత్రమును జూచుటకు నావకాశము లేక పోయెనా? ప్రౌఢకవి మల్లన్న యన్నపేరు విన్న యెడల వీరిప్రౌఢమువారు ప్రౌఢకవివారు శైవులయందు ద్వైతులయందుఁ దెనుఁగు దేశమునందుఁ గానవచ్చు చున్నారని వ్రాయుదు రేమో!

ii కవిసార్వభౌమబిరుదము రసికాభిలాషమునఁ బ్రయోగింపఁ బడినను శ్రీనాథుఁడిది రచించెనని తెలియఁజేయదఁట! అమీఁదిపద్యముననే శ్రీనాథపదము

సహితము ప్రయోగింపఁ బడినదే. ఈ రెండును గలిపి యాలోచించినచో నీగ్రంథము శ్రీనాథుని దన్నయూహ మఱెంత బలము కాదా? ఆసంగతిఁ గూర్చి విమర్శకు లేల సన్న సన్నగా నూరకుండిరి? తమవాదమునకు విరుద్ధముగా నుండు వానిని విడుచుట యీ విమర్శకలక్షణము? కవిసార్వభౌమబిరుద మనేకులకుఁ గలదఁట! శ్రీనాథునికిని గూచిమంచి తిమ్మకవికిని గాక యితరుల కెవ్వరి కున్నదో విమర్శకులు సెలవిచ్చిన వింటము. కవిసార్వభౌమబిరుదమును శ్రీనాథనామమును గలిపి ప్రయోగింపఁ బడుటచే మనము కూచిమంచితిమ్మనను విడిచి శ్రీనాథునే తీసికొన వలసి వచ్చునుగదా! ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవిసార్వభౌముఁడనని పుస్తకములలోఁ బ్రయోగించుకొను చుండునఁట! ఈవిమర్శకులు నాలుగుపద్యము లల్లియుండిరేమో! కవిసార్వభౌముల మని పుస్తకములలోఁ బ్రయోగించుకొనిరా? పోనిండు; విమర్శక సార్వభౌములని యైనఁ జెప్పికొందురా? వారు గాక పోయిన, నట్లు ప్రయోగించుకొనిన వారి పేరులు కొన్ని సెలవిచ్చెదరా? వాగనుశాసనప్రబంధపరమేశ్వరాంధ్రకవితాపితామహాది బిరుదములు గూడ నాలాగుననే యిటీవల నుపయోగింపఁబడెనా? మఱి యొకటి: గ్రంథము దుర్నీతిబోధక మగుటచేతనో మఱియెందుచేతనో కవి గద్య వేసికొనట మానినందున మఱియేవిధముగాఁ గూడఁ దనకర్తృత్వమును దెలియఁజేయుట కిష్టపడి యుండఁడని వీరు నిర్ధారణ చేయుచున్నారు! కవి గద్య వేసికొనుట మానెనని యెవ్వరికిఁ దెలియును? ఇప్పుడు లభించినప్రతిని వ్రాసికొనినవారు గద్య విడిచిపెట్టి యుండవచ్చును. గద్య వేసికొనలేదు పో, రసికాభిలాషము గద్య యవసర మున్నంత పెద్దగ్రంథము? వీథినాటకమునకుఁ గవి యేగద్య వేసికొనెను? దుర్నీతిబోధక మని మానెనన్నచోఁ, గూచిమంచి జగ్గకవి తన చంద్రరేఖా విలాపము సునీతిబోధక మనియే కాఁబోలు దానియందుఁ గద్య వేసికొనెను?

iii శ్రీనాథునిగ్రంథము లన్నిఁటినుండి లక్షణగ్రంథములకు లక్ష్యపద్యములఁ దీసికొనిన యప్పకవి మొదలగులాక్షణికులు రసికాభిలాషము పేర యైనఁ దలపెట్టకుండుటకుఁ గారణమేమని విమర్శకులు ప్రశ్న వేయుచున్నారు. వీరఁట పీఠికను మూలమునకు శ్రద్ధతో నెన్నిమారులు చదివిరఁట! అవును, గ్రంథపఠనము దేవబ్రదికునట్లో కాదు మాటలు చదివినను దెలివిలేని విద్యార్థికిది యెట్లు పట్టినవును? "శ్రీనాథుని వీథినాటకము లోకమునఁ బ్రచురమయ్యు నీరసికాభిలాషము కానందులకుఁ గారణము లేకపోలేదు. ఇందుఁ గవియుద్దేశించిన నాయిక గొప్పరాజుల యింటిదగుట నిశ్చయ" మని పీఠికలో స్పష్టముగాఁ దెలుపఁబడి యుండఁగా, వీరికి శంక కింక నవకాశమేది? అదియేల వీరు మూఁడ్రెండు? చూచినచో నేల ఖ డిపస్తారి? వ్రాసినది తిన్నగాఁ జూచి యర్థము చేసికొనఁగల శక్తి వచ్చినవెనుకనే విమర్శనముల నారంభించుట మంచిదేమో! పోనిండు, కార

ణము చెప్పఁబడలేదే యనుకొందము. అయినను దమలక్షణ గ్రంథముల నప్పకవ్యాదులు పద్యము లుదాహరింప మానినంత నే పూర్వగ్రంథములఁ గూర్చి యనుమానము పడుటకూడునా? మరుద్రాజచరిత్ర, పండితారాధ్యచరిత్ర, శాలివాహన సప్తశతి, పల్నాటివీరచరిత్ర, యనుగ్రంథములనుండి మాత్రము వారుదాహరణములఁ గైకొనిరా? అదిమాత్రముచేతనవి శ్రీనాథునివి కావనుచున్నామా? భోజరాజీయము, విజ్ఞానేశ్వరీయము, మార్కండేయపురాణము, ప్రబోధచంద్రోదయము, కువలయాశ్వచరిత్రము, భానుమతీపరిణయము మొదలగు కొన్నిగ్రంథములనుండి యప్పకవి మొదలగువారు పద్యము లుదాహరించుట మానలేదు? లాక్షణికులు తమకవసరమైన లక్ష్యములఁ బూర్వప్రబంధము లన్నిటినుండియు దీసికొన వలయునా?

vi. శైలి శ్రీనాథుని శైలితో నెంతమాత్రమును బోలదఁట! శ్రీనాథుని రే శైలితోఁ బోలదు? వీధినాటకమందలి శైలితోడనా, శృంగారనైషధమందలి శైలితోడనా, హరవిలాసమునందలి శైలితోడనా? ఒక్కకవియే వేఱువేఱు ప్రాయము లప్పుడు వ్రాసినయెడలఁ గవిత్వమునను వేఱువేఱు శైలులు వచ్చును. కవిబ్రహ్మ యను పేరుకనను వచ్చుటకుఁ దగినట్లుగా భారతభాగము నాంధ్రీకరించిన తిక్కయజ్వ సోమయాజికాకపూర్వము రచించిన నిర్వచనోత్తరరామాయణమును జూచిన, నది యాతనిదా యనిపించును. కవిరాజమనోరంజనము పిల్లవసుచరిత్రమని పేరు పడునంత ప్రౌఢముగా రచియించిన కనుపర్తి యబ్బన్న చిన్నతనమునందు వ్రాసిన యనిరుద్ధచరిత్రమును జూచిన, నది యాతనిదా యనిపించును. చేమకూర పంచి పాకమునఁ బడినదని మెప్పు గాంచునట్లు విజయవిలాసమును విరచించిన వేంకటకవి యంతకుఁ బూర్వము చేసిన సారంగధరచరిత్ర చూచిన, నది యాతనిదా యనిపించును. ఈసంగతులను మనస్సునందుంచుకొని యుండినచో విమర్శకులు శైలిపోలదని వ్రాసియుండరు. రసికాభిలాషము శృంగారనైషధాదులవలె సంస్కృతచ్ఛాయిష్ఠము కాదు గాని కొంతవఱకు వీధినాటకకవిత్వమును బోలుచున్న దనవచ్చును, వీధినాటకము వ్రాసినవయస్సునకును భిన్నమైనప్రాయమున వ్రాయఁబడి యుండినచో వీధినాటకశైలికంటెఁ గూడ దీనిశైలి భిన్నమైయుండవచ్చును. శ్రీనాథుని గడుసుఁదనపుఁబోకడ లిందెక్కడను గానరావఁట! శ్రీనాథునిగడుసుఁదనపుఁబోకడల కేమిగాని, నైషధాదులయందున్న గడుసుఁదనపుఁ బోకడలేవో రసికాభిలాషమునందు లేనివేవో దృష్టాంతములతోఁ జూపి, తమవాదము హేతువులతో సిద్ధాంతీకరింప కొనక వట్టిమాటలమాత్రముచేతఁ గాలక్షేపము చేసిన యీవిమర్శకుల గడుసుఁదనపుఁ బోకడను మాత్రమెంతైనను మెచ్చవచ్చును. అలాగుననే కల్పన లెక్కడనో కాని తఱచుగాఁ బ్రౌఢముగాలేవని వీరు మాట మాత్రముచేతనే స్థాపింపఁ జూచుచున్నారు! 'కాదన్నవాఁడు కరణ' మన్నట్లు

వ్రాసిన యీవ్రాఁతలవలనఁ బ్రయోజనమేమి! రసికాభిలాషము శ్రీనాథుని దని హేతువులతోఁ జెప్పినను జనులొప్పుకొనఁ గూడదఁట! కాని యీవిమర్శకు లేమి చెప్పినను, జెప్పినంత మాత్రముననే యొప్పుకొన వలయునుగాఁబోలు! 1, 2, 26, 27, 50 పద్యములు దప్ప రసికాభిలాషమునందుఁ గల్పనలులేనిపద్యములు వీరు మఱియెన్నిసారులు మూలముచదివి యైనఁ జూపఁగలరా? వానిలోని కల్పనలు మాత్రమే ప్రౌఢముగానున్నవని వీరియభిప్రాయమో, తక్కిన వేలకావో కారణసహితముగా వీరు నిరూపించినఁ గదా తిరిగి యేమి చెప్పుటకైన వీలుండును!

v రసికాభిలాషమునందు శ్రీనాథుఁడు ప్రయోగించి యుండనియాధునిక ప్రయోగము లున్నవఁట! ఈసంగతి పోల్చుకొనుటకు నుపయోగించిన కుశాగ్రబుద్ధిని మఱికొంత యుపయోగించి వీరు పైసంగతి కూడ గ్రహింపలేకపోవుట చిత్రముగా నున్నది. శిథిలములైన స్థలములఁ గ్రొత్తగాఁ బూరింపఁ బడిన భాగములు కుండలీకరింప వలసినయవసరము లేకుండ సులభముగాఁ బోల్చుకొనఁగలుగుటకు యచ్చోటుల నెల్ల వీరైనవలెను నాధునికప్రయోగములే చేయఁబడియుండఁగా "మాబుద్ధికిఁ జూడ గ్రంథమంతటను నొక్కశైలియే కనఁబడుచున్నది కాని వేర్వేఱుశైలులు కనఁబడుట లే"దని వీరువ్రాసిన నదియెంత హాస్యాస్పదముగా నున్నదో చూడుఁడు. ఆధునికప్రయోగములఁ జూపఁగలుగుటచే శ్రీనాథునిగ్రంథము కాదని స్థాపింపఁ గలిగితి మనివీరు సంతోషించిరే కాని, క్రొత్తగాఁ బూరింపఁ బడినభాగము లున్నవే, యీ నవీనప్రయోగము లందలి వేమో యనుసంశయము కూడ వీరు పొందరైరే. పాపము, తమయుక్తి యప్రతిహత మనుకొనిన వీరి యుత్సాహమునకు భంగము కలిగినందులకు విచారింప వలసినదే. "లజ్జిలినాను" అనునది కేవల మసాధు వని వీరు వ్రాయుచున్నారు. "ఉన్నాఁడను" అనుదానికి "ఉన్నాను" అనునది రూపాంతర మయినట్లే "లజ్జిలినాఁడను" అను దానికి "లజ్జిలినాను" అను రూపాంతర మున్నట్లు మతాంతరము గలదు; ఆధునికప్రయోగములు గలవు. కావలసినచో మనోరమాపత్రికాధిపతులచే రచింపఁబడి మనోరమయందుఁ బ్రచురింపఁబడిన ప్రసన్నయాదవనాటకమున 21 వ పుటఁ జూడుఁడు. అందు "బ్రతికినాను" అనురూపము ప్రయోగింపఁ బడినది. ఇది సాధువైన నసాధువైనఁ బ్రకృతాంశమున కొక్కటియే. శ్రీనాథుఁ డిట్లు ప్రయోగించియుండఁ డన్న దానితో నిర్వివాదముగా నేకీభవింప వచ్చును. విమర్శకులు కష్టపడి యుదాహరించిన ప్రయోగములం బట్టి చూడ, యీగ్రంథమునందుఁ గ్రొత్తగాఁ బూరింపఁ బడినభాగములే నవీనుఁడు రచించినట్లు తోఁచును గాని గ్రంథమెల్లను శ్రీనాథాదులగుప్రాచీను లెవ్వరయిన వ్రాసి యుండరని తోఁచవలసిన యవసరములేదు.

vi శ్రీనాథుఁడు పరమభాగవతోత్తముఁ డఁట! నైష్ఠికుఁడఁట! ఇట్టిగ్రంథమును వ్రాసియుండఁ డఁట! యాత్రికొఱకు వచ్చెడి సకలజాతులవారలను

జూచి వర్ణించుటకై నేమి, సింహాచలము వంటి పుణ్యశైలములమీఁదఁ సంతతమును గూర్చుండి నమహానుభావుఁడు పరమభాగవతోత్తముఁ డనవలసినదే. సీల్లరేవులకు వచ్చెడి మంగలి, చాఁకలి, తెలకలి పశువులను సయితము వలచిన నేమి, వారిచేత శ్రీకాళికేశ్వరీచరణములపై నొట్టు వేయించుకొనిన ధన్యాత్ముఁడు నైష్ఠికుఁడన వలసినదే. "ఈతఁడు యౌవనదశయందు శృంగారనాయకుఁడై స్త్రీలోలుఁడై తిరిగె" నని యొకచోటను, "అవసానదశయం దిట్టికష్టముల కెల్లను గారణము యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛగా విహరించి దేహమును ధనమును పోఁగొట్టుకొన్న పాపఫలము తక్క వేఱొక్కటి కానరా" దని మఱియొక చోటను కవులచరిత్రయందు వ్రాసిన రావుబహద్దరు వీరేశలింగము పంతులుగారి విమర్శకుల పాటి యెఱుఁగరు కాఁబోలు! "విధివిరామము లేక వేశ్యాకాంతలఁ గూడు శ్రీనాథకవి" యని వ్రాసిన శతావధాన తిరుపతివేంకటేశ్వరకవుల కీమాత్రము తెలిసినది కాదు కాఁబోలు! వయస్సు ముదిరిన తరువాత గ్రంథములలో వ్రాసిన శ్రీరంగనీతులు వృద్ధనారీపాతివ్రత్యమును సూచించుచునని యెఱుఁగక వీరిట్టి వ్రాతలు వ్రాసిరి. కాశీఖండ భీమఖండ గ్రంథకర్త యగుట మాత్రము చేతనే శ్రీనాథుఁడు సతతమును బరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడు నైనచో, "భువనైకమోహనోద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారి సంతతమధురాధరాధరసుధారసధారలఁ గ్రోలు" చుండినను గాళహస్తీశ్వర మహాత్మ్య గ్రంథకర్తయగు ధూర్జటి మాత్రము పరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడును గాఁడా? లేక, "పవిత్రుని జారుఁడనంగ రాదు వాలుచం బరకాంతలఁ గూడెనేనియు" నని విమర్శకుల యుద్దేశమా? శ్రీనాథుని జారవృత్తి సిద్ధి యబద్ధమైనదని విమర్శకులు లేమైనఁ గారణములు చూపి పరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడు ననిన బాగుగా నుండును. రసికాభిలాషము వ్రాయునరికి శ్రీనాథుఁడు శృంగారనాయకుఁ డనుట స్పష్టము. శృంగారనాయకుఁడనని తెలియఁ జేసికొనుటకే తననామమును శ్లేషించుచు శృంగారశ్రీనాథపదము నుపయోగించియుండును. రసికాభిలాషము శ్రీనాథునదని చెప్పుటవలన నాతనికీర్తి పోవఁగునేమో యని విమర్శకులు జడియ నవసరము లేదు. వీథినాటక మాతనిదని చెప్పుటవలనకంటె నిప్పు డెక్కువగా నాతని కీర్తి పోదు కాదు. రసికాభిలాషమున బూతు విస్తారముగా నున్నదని శ్రీనాథుడాగ్రంథము తనదని తెలియఁజేసికొనుటకు సిగ్గుపడెననుట యాలోచనలేని వ్రాఁత. ఈమాత్రపు శృంగారపద్యములనతఁడు తక్కిన గ్రంథములలో వ్రాసీయేయున్నాఁడు. వీథినాటకములోనివని యప్పకవి యుదాహరించిన "ఘనమున బద్దనచేఁ గొంగు" "చందుక కేళిసల్పెడు పరికారసునన్" మొదలగు పద్యములు బూతు లేనివా? అవి కమలనాభామాత్యపౌత్రుఁడు మారయామాత్య పుత్రుఁడు నగు మహాకవి శ్రీనాథుఁడు రచించినవేకదా! ఒక్క శ్రీనాథుఁడే యన్నమాటయేమి? శృంగార

ప్రబంధముల వ్రాసిన సంస్కృతాంధ్ర కవులెల్లరు నిప్పటిమనరు బూతుగాఁ దోఁచు నీమాత్రపు శృంగారమును వాడియేయున్నారు. విమర్శకులు గ్రంథపరిశోధన బాలకయో, చదివినది పురచియో, కాళిదాసాదులగు సంస్కృతకవులు, కవిత్రయమువారు, పింగళి సూరన్న మొదలగు తెలుఁగువారు శృంగారరసము రసికాభిలాషములో నున్న దానికంటెఁ దక్కువగా వ్రాసిరని చెప్ప సాహసించిరి. అయుదానినోటిలో సయితము "నీగుబ్బల నుబ్బించిన నీయౌవనశృంగారము నే నిరీక్షించుకోను" యన్నమాటలఁ బెట్టిన కాళిదాసుని శృంగారము వీరికి రుచించినది! పురాణకవులగు కవిత్రయము వారిమాట కేమిగాని ప్రభావతీప్రద్యుమ్నముల సమాగమము మొదలుకొని వారిరత్యాదులను విజృంభించి వర్ణించిన పింగళిసూరన్న శృంగారము వీరికి రుచించినది! స్త్రీవర్ణనము నఖశిఖపర్యంతము నొక్క చోట వర్ణించి విషయపసందుఁజేసి, రతివర్ణనము సయితము మానని యక్కాలపు శృంగారప్రబంధకవుల శృంగారమెల్ల వీరికి రుచించినది! కాని యేహేతువుచేతనో పాప మీరసికాభిలాషము నందలిశృంగారమన్న మాత్రము వీరికిఁ దల కంటగించినది! ఇదియెట్టు లుండినను గాని, నవీనులలో సంఘసంస్కర్తలైనవారు నవీనము చేసిన శృంగారము రసికాభిలాషములోని దానికంటెఁ దీసిపోదే! దానినీవిమర్శకు లెట్లు సహింతురు? పూర్వోదాహృత కవులగ్రంథములు సర్వకళాశాలాపరీక్షలకుఁ గూడ నియమించుచున్నారే. విద్యార్థులు తలవంచుకొని యందఱు జదువనే చదువుచున్నారే. శృంగారభూయిష్ఠములని తలఁపఁదగిన వైజయంతీవిలాస విజయవిలాస ముఖ్యప్రబంధముల నాగరిక పత్రికాధిపతులును ముద్రింపించి ప్రచురించుచున్నారే ఆనివృత్తులఁ గూడ నీవిమర్శకులేల యూరకుండిరి? శ్రీనాథునికన్న హేతువుచేత రసికాభిలాషమును మూలనడఁగఁ ద్రొక్కి పరిత్యజించుట యొక సాహసము కాదుగాని, యీవిమర్శకులకుఁ దెలిసియుఁ దెలియని విమర్శనము వ్రాయుట సాహసమే. వెనుకముందు లాలోచింపక తొందరపడి వ్రాసిన యీవిమర్శనము చూడఁగా నిది విమర్శనాశక్తి చేత నోడ తెలుఁగక యున్న ధూర్తవిమర్శకుఁ డెవ్వఁడో వ్రాసియుండవచ్చునని తోఁచుచున్నది. కవిత్వశైలిం దెలుపుట కుదాహరింపవలసిన మృదువయిన పద్యములు రసికాభిలాషమున లేవటే? పీఠిక నెన్నియోసారులు చదివియు నీవిమర్శకునికి లాభింపకుండుట చూపఁబడెనుగదా! మూలము నెన్నియోసారులు చదివినను లాభింపకుండుటకు నిది నిదర్శనము. లాభించి యుండినయెడల 1, 2, 8, 10, 17, 26, 82, 38, 45 వ పద్యము లుదాహరించిన నష్టములేదని తెలిసికొనక పోయియుండునా? అందు రెండు శైలి తెలుపుట కీదిగువ నుదాహరింపఁ బడుచున్నవి.

ఉ. మత్పరితాపమంబుజసమంచితవక్త్రి, సశోకపల్లవాం
చత్పరిభాసితాంఘ్రిని, రసాలసమాధర, మల్లికాంగి, నీ
లోత్పలనేత్ర నిన్నుఁ గను ♦ చున్న కొలందిని హెచ్చుఁ జొచ్చె నో
యుత్పలగంధి! పంచశరుఁ ♦ డూనుశరంబులనిగ్గునోకదా! 10

ఉ. నీవెలఁదుల్వ నీరుచము ♦ నీమెయి చాయయు గారయంగ గం
గాయమునాసరస్వతులు ♦ గా హృదయంబున నిశ్చయించితిన్:
మాయురె! పుణ్యభూమివి సుమా! నినుఁ జేరినవారి కెల్లనున్
మాయుఁ దనోజతాపములు ♦ మానిని! నన్నికఁ జేరఁ దీయుమా. 17

విశాఖపట్టణము,
1వ సెప్టెంబరు 1907 సం॥

సెట్టి లక్ష్మీనరసింహము.



శ్రీరస్తు.

# రసికాభిలాషము.



శ్రీపుత్రీసతీసన్నిభ
రూపవతీ! మదవతీ! మ♦రుఁడు తనపూవుం
దూపులనా? నీవాలుం
జూపులనా? నన్నుఁగొట్టు♦చు న్బాధించున్?॥

సీ॥ కొదమతుమ్మెదచాలు ♦ నదలింపఁగం జాలు
కప్పుతోఁ దనరు మే♦ల్కొప్పుతోడ,
వెన్నెలలం జల్లి ♦ విలసిల్లుజాబిల్లి
గోముతోఁ దనరు నె♦మ్మోముతోడఁ,
బదను వెట్టిన మారు♦బాణమ్ముల న్మీఱు
నేపుతోఁ దనరు వా♦ల్చూపుతోడఁ,
దొగరు మెండుగఁ బండు♦దొండపండున నుండు
కావితోఁ దనరు కె♦మ్మోవితోడ,

తే॥ గీ॥ సందెవేళను మేడపైఁ ♦ జల్లగాలి
కొఱకు విహరించు నిన్నుఁ గ♦న్గొన్న యంత
నీపయినె కడు దృఢముగా ♦ నిలిచి యుండి
నాకు వశము గా కున్నది ♦ నా మనమ్ము॥ 2

ఉ॥ సుందరి! పంట నొక్కఁగను ♦ జొక్కపుమోవి సుధారసంబు, చే
తం దుడుకారఁ బట్టఁ బలి♦తంపుఁజను ల్వ్రేలిమేన్గుకుంభముల్,
సందిటఁ బట్టి నిల్పఁగను ♦ సన్నని కౌ నల మిన్ను; గాన నీ
'వందనిమ్రానిపండు' వని ♦ యాసను మానదు డెంద మ య్యయో!॥

చ॥ పిడికిటఁ బట్ట ని ట్టటులు ♦ బిట్టుగ మిట్టి పడంగఁ జొచ్చె నీ
దుడుకుఁజనుంగవం బలెనె ♦ త్రుళ్లుచు నా హృదయంబు గూడ నొ
క్కొ-డను నడంగ కున్న యది; ♦ యి య్యెడ గుబ్బల నాదుఱొమ్ము నం
దడఁగఁగఁ బట్టి యుంచు, తగి♦నట్టివె యయ్యవి జట్టు పట్టఁగన్॥

సీ॥ చెలువ! నీ చక్కని ♦ చెక్కిలి నొక్కి మ
క్కువ నేను నొక్కించు ♦ కొనుట యెపుడొ?
రమణి! నీ మధురాధ ♦ రమ్మును గొఱికి మ
క్కువ నేను గొఱికించు♦కొనుట యెపుడొ?
కొమ్మ! నీ ఱొమ్ము నా ♦ ఱొమ్మునం గ్రుమ్మి మ
క్కువ నేను గ్రుమ్మించు♦కొనుట యెపుడొ?
కాంత! నీ నెమ్మేను ♦ గౌఁగిటం జేర్చి మ
క్కువ నేను జేర్పించు♦కొనుట యెపుడొ?

ఆ॥ వె॥ తెలువ, నిన్ను రతులఁ ♦ దేలిచి నేను దే
లించుకొనుట యెపుడొ? ♦ లేమ, నేను
నీవు ననెడుభేద ♦ మే విధంబున లేక
యుండఁ గలుగు టెప్పు ♦ డొక్కొ యింక?॥ 5

ఉ॥ కాముఁడు నా మనస్థలిని ♦ గల్గిన ధైర్యధనంబు నెల్ల నో
కోమలి! దొంగిలించి యిఱు♦కుంజనుకొండలసందు నందుఁ దా
నీ మెయిఁ బొంతి పెట్టెను గ♦దే! ననుఁ జూచుకొనంగ నీయు మా
సీమను; సంశయస్థలులఁ ♦ జేతులఁ గ్రుమ్మెద, గోళ్లఁ ద్రవ్వెదన్॥

మ॥ "అహహా! నీ కచ మంగజాతగుణము, ♦ న్హాసంబు చంద్రప్రభ,
స్మహితాక్షు ల్పవనాశ్వముం గెలిచె," న♦న్నుగఁ నన్ను బాధింప నా
కుహూను ల్మ్యాని రిడే గిరీశసమవ♦క్షోజా, తమోవేణి! యో
యహిరోమావళి! ప్రోవ రమ్మ, నినుఁ జూ♦మ్మా నెమ్మది న్నమ్మితిన్॥

సీ॥ నీ కురు ల్నిముర నే ♦ నేర్చు నంతకె హేమ
నాస! తుమ్మెద నన్ను ♦ గాసి పెట్టు;
నీ పల్కుల న్విన ♦ నేర్చుదన్కనె శంకు
మదగంధి, చిలుక న ♦ న్నెదరఁ జేయు,
నీ గళస్వర మెన్న ♦ నేర్చుపర్యంతమె
రామ, కోయిల నన్ను ♦ రా పొనర్చు,
నీ నెన్నడలఁ జూడ ♦ నేర్చుదాఁకనె ఘన
వేణి, రాయంచ న ♦ న్నేతల ముంచు,

ఆ॥ వె॥ మరునిరాజ్యమునకుఁ ♦ గరుణ న న్బట్టాభి
షిక్తుఁ గాఁగ నీవు ♦ చేయువఱకె
మరుని బలఁగ మిట్టి ♦ మాడ్కిని నన్ను బా
ధించు చుండు నో ర ♦ తీవిలాస॥ 8

చ॥ మదనుధనుర్గుణంబు పయి, ♦ మార్గణపాళి పయి, న్ధనుస్సు పై
మది నుదయించు నాదుపగ ♦ మానఁగ నంగజసంగరంబున
న్మదవతి, నీదుకొ ప్పొడిసి ♦ మాటికిఁ బట్టుకొనంగ, నీ యెడ
ల్పదిగ నలంచ, నీపెదవిఁ ♦ బంటను సారెకు నొక్కఁ గోరెదన్॥

ఉ॥ మత్పరితాపమంబుజస ♦ మంచితవక్త్రి, నశోకపల్లవాం
చత్పరిభాసితాంఘ్రిని, ర ♦ సాలసమాధర, మల్లికాంగి, నీ
లోత్పల నేత్రి, నిన్నుఁ గను ♦ చున్న కొలందిని హెచ్చుఁ జొచ్చెఁ నో
యుత్పలగంధి, పంచశరుఁ ♦ డూనుశరంబులనిగ్గువో కదా?॥ 10

చ॥ కవు లెటు లన్న నేమి? యుప ♦ కారి యగుం గద శంబరారి? ని
న్గవుఁగిట బిగ్గఁ జేర్చుకొనఁ ♦ గా నుబుకుం గలయట్టినీదుచ
న్గవ నడిభాగమం దిముడఁ ♦ గాఁ గడుఁ గష్ట మటంచు నెంచియే,
తవులఁగఁ దూపులం బఱపి ♦ తద్దయు గ్రుచ్చెడు నాయురస్థలిన్॥

చ॥ విరహపువేఁడిచే మిగుల ♦ వేదనఁ బొందుచు నున్న వాఁడ, దు
ష్కరము భరింప; నీ నగవుఁ♦గప్పురముం, జనుతమ్మి మొగ్గలుం,
గరకిసలంబు, లూర్పువలి♦గాలులు, బాహుమృణాళము, ల్నిరం
తరమును మేనఁ జేర్చినఁ గ♦దా ముగుదా, యుపశాంతిగల్గెడున్॥

చ॥ బిగువును బింకముం దనర ♦ బిట్టుగ లోపలఁ గుమ్ములాడు, నాఁ
పఁగ మఱియింత తుళ్ళి పడుఁ,- ♦ బైకిఁక భేదము లేనియట్టులే
యగపడు నీదునిబ్బరపు♦టబ్బురపున్నిగిగుబ్బ; లాఁప నే
వగ నగు? 'మర్దనంబె గుణ♦వర్ధన', మట్టులు చేయ సీయుమా॥

ఉ॥ తైకముడి న్సడల్చి కడు ♦ అంపిలు నీ బలితంపుఁజన్నుల
న్నా కర మందుఁ బెట్టు మని♦నం, గరమం దవి పట్ట వందువో?
కోకముడి న్సడల్చి కులు♦కుంగవునుం గయికొంట కష్ట మే
మో? కమలాక్షి! 'సూక్ష్మమున ♦ మోక్షము' గల్గినరీతిగా నగున్

మ॥ కనకాంగీతిలకంబ, కుంకుమపరా♦గంబుం బయిం బూసికొం
చును మే ల్సాధన చేయు బ 'ల్గరిడిము♦చ్చు, ల్గావె నీ నిస్తుల
స్తనము? ల్చాలఁ దయారుబోనె తగుఁ, జే♦తంజిక్కునే? కంచుకం
బును విప్పంగ నొకప్డు పట్టఁ గల నే♦మో నేఁ బ్రయత్నించెదన్॥

శా॥ కాంతా! మీటినయంత విచ్చునటులే ♦ కన్పట్టుచు స్నీదు చ
న్బంతు ల్పట్టుకొనంగ మిట్టి పడు న♦న్నా!'నాలిమ్రుచ్చు' ల్గదా?
యెంతో సిగ్గునఁ జాటుగాఁ బయఁటలో♦నే యున్న యట్లుండియు
న్నుం తైనం దము నెవ్వరేని గనఁ బి♦ల్చుం బట్ట రండం చహో!

ఉ॥ నీ యెలనవ్వు, నీ కచము, ♦ నీ మెయిచాయయు నారయంగ గం
గాయమునాసరస్వతులు♦గా హృదయంబున నిశ్చయించితిన్,
మాయురె! పుణ్యభూమివి సు♦మా! నినుఁ జేరినవారి కెల్లను
న్మాయు మనోజతాపములు; ♦ మానిని, నన్నిఁకఁ జేరఁ దీయుమా॥

చ॥ పొలఁతిరో! నీదుమోవిఫల ♦ ము, న్వచనాంబుకణంబు, లూర్పుగా
లులె నిరతంబుఁ గ్రోలుచును ♦ లోపల నీ చెలువంబె చూచుచు
న్బలితపుగుబ్బగుబ్బలుల ♦ పైఁ దప మే నొనరింతుఁ; గూర్మియు
గ్గలముగ నీవిమోక్షమును ♦ గల్గఁగఁ జేయుము నాకు నీ విఁకన్॥

మ॥ కలికీ! పువ్విలుకానికొమ్మలికి, ని ♦ క్కంబిద్ది: నూఁగారుచీ
మలు పోగై పయిఁ బెట్టుపుట్టలగుఁ జు ♦ మ్మా నీ కుచమ్మా! ల్భుజం
గులపాలౌ నని చెప్పఁగా వలెనె? నా ♦ కుం గూడ నా భాగ్య మె
ట్టులిఁ కేనాఁటికిఁ గల్గునో యెఱుఁగ కి ♦ ట్టు ల్వేదనం బొందెదన్॥

చ॥ అటు నిటుఁ జక్రిపాలనము ♦ నందు నితంబకుచంబు లున్ననుం
గటకట! మధ్యనాభిసుడి ♦ గల్గుటచే నిఱుపేద యయ్యె నీ
కిటకిట లాడుకొను; పరి ♦ కింపవు కావున బాధ బెట్టెదం
గటిని గుచంబుల, న్మఱియుఁ ♦ గౌను సుఖింపఁగ ముష్టిఁ బెట్టెదన్॥

మ॥ పరకాంత న్నిను బల్మిఁ బట్టుకొనఁగా ♦ భావించుపాపంబు నా
కరము ల్పాపికొనంగఁ దావకకటి ♦ త్స్మాచక్రిమం డిల్లెడం
దిరుగ, న్నీ కుచదివ్యశైలములపై ♦ నిం జేర, నీసుస్మితా
మరకల్లోలినిలోన మున్గఁ గరుణ ♦ న్మార్గంబుఁ గల్గింపుమా॥ 21

సీ॥ గొప్ప దౌ నీ కప్పుఁ ♦ గొప్పుచీఁకటిని గ-
రమ్ములఁ జొన్పినన్ ♦ రాజ నౌదుఁ,
గమ్మ నౌ నీ ముద్దుఁ ♦ గెమ్మోవిసుధను బొం-
దుట గల్గిన న్విబు ♦ ధుండ నౌదుఁ,
గుల్కు లౌ నీ కుచ ♦ కుంభముల న్గోళ్ల
నునిచినం బురుషసిం ♦ హుండ నౌదు,
సన్నమౌ నీ కౌను ♦ మిన్నును విడువ కె-
న్నందును బట్ట ఘ ♦ నుండ నౌదు,

తే॥ గీ॥ నింక వేయును నేల? నీ ♦ వెపుడు నన్ను
మదనకదనంబున న్మెచ్చి ♦ మరునిరాజ్య
మునకుఁ బట్టంబు గట్టెదో ♦ పొందు నాదు
జన్మ మపుడె సార్థకత ని♦శ్చయము గాఁగ॥ 22

చ॥ భ్రమ గొని మోవిబింబమును♦ బంటను నొక్కఁ శుకుండఁ, జన్ను కుం
భములను గోళ్ల నిచ్చమెయి ♦ వ్రిచ్చినఁ గేసరిడింభకుండ, సం
భ్రమమున వేణిసర్పమును ♦ బట్టుకొనంగ వినాయకుండనుం
జుమి, యిటు నీదుపొం దొదవు♦చో నిరతమ్ము ను బ్రహ్మచారినే॥ 23

శా॥ ఏలా యో బలుసోయగంబులకుదీ♦వీ! జాలముం జేయ? నే
నే లీల న్విరహాబ్ధి నీఁదుదును? ని ♦ న్నేలాగునం జేరుదున్?
జాలిం జూపకయున్న మన్మథశరా♦సారమ్ముచే మున్గిదం,
దేలింపం గదె గుబ్బకుండలను గుం♦డె న్మోపి నన్నీరొడన్॥ 24

సీ॥ నలుదిక్కులం జీఁక♦టులు గ్రమ్మఁ గబరీభ
ర మ్మను హాలాహ♦లమ్ము చెదర,
మిగులఁ బొంకంబుగా ♦ బిగిగబ్బిగుబ్బ ల
న్వెలియేన్గుకుంభము ♦ ల్వెలికిఁ దోఁప,
నడ్డంబుగా బాహు ♦ లను నట్టి వేలుపు
మ్రాఁకులేఁగొమ్మలు ♦ పైకి లేవ,
నె ల్లెడ న్వెన్నెల ♦ ల్ప్రల్లుచుఁ జెలువగు-
వదనము చంద్రప్రభ ♦ జనన మొంద,

తే॥ గీ॥ వరుస నిట్లు నీ సౌందర్య♦వారిధి గతి
మథనమును నొనర్చి యధర♦మధురసుధను
బొందు టెన్నఁడొ? యో జగ♦న్మోహినీ! భ
వత్కరుణ లేక యది పొంద ♦ వశమె నాకు? 25

చ॥ కనికర మించు కేనియును ♦ గల్గినదానవు కా వటంచు ని
న్నిఁకఁ గలనా? దినంబు లల♦నా, కల లందున నైన రాత్రిలం
గనఁబడి నన్నుఁ దన్పుదువు♦గా? పది వే లదె, “లేని మామక
న్నను గడు గ్రుడ్డిమామ యయి♦నన్నయ’ మన్నది యున్న దేకదా?

సీ॥ ఎదు రొత్తు కులుకు గ♦ద్గద మెత్తు పలుకును
నలరెడు రతిసమ♦యంపు వెరపుఁ,
జెలరేఁగుకురులు ను♦య్యెల లూఁగుసరులును
నింపారు పురుషాయి♦తంపుహరువు,
నర డిందుచూపుఁ జిం♦దర చెందురూపును
దనరు చున్న సురతాం♦తంపుఁ దెలివి,
విడఁబాఱు తైకపె♦న్ముడి జాఱుకోకయుఁ
దగఁ బాన్పుపై నుండి ♦ డిగెడుమురువుఁ,

తే॥ గీ॥ గలలలోపలఁ బలుమాఱుఁ ♦ గాంచి కాంచి,
కాంతుఁ డీఱి నిన్మఱిమఱి ♦ కౌఁగిలించి,
యంతలో నిద్ర మేల్కాంచి ♦ యెంతొ వింతఁ
గాంచు చుందు నిస్గాన కో ♦ మించుబోఁణి! 27

చ॥ కల నొకమాఱు నీవు అవి♦క ర్ధరియింపక జిల్గుఁబయ్యెదం
బొలఁగఁగఁదోఁయు నిక్కుఁజను♦దోయి ఖచిక్కునఁగుత్రిమ్మ నా యుర
స్థలి నవి దూఱి చిక్కువడి ♦ చచ్చిన రా వఁట! నూత్న పార్వతీ
శులవలె నల్లె యుండు మఁట ♦ చోద్యముగా మన మెల్లకాలముఁ

చ॥ ఇఁక మఱియొక్కమాఱు నిను♦ నే బిగియాఱఁగఁ గౌఁగిలింపఁగాఁ
బికపిక లాడు నీ చనులు ♦ వీఁపునఁ దూసిన వంట! నే వికా
పికను ‘విచిత్రపుస్త్రీ’జాఁగ♦వీఁపునఁ జన్నులు పుట్టె!’ నంచు దా
నికి వెడనవ్వు నవ్వెదను ♦ నిద్దుర లేచితి, నంద తే మనఁ 29

చ॥ మఱియొకమాఱు వెల్లకిల ♦ మంచముమీఁదఁ బరుంటి వంట! నేఁ
దొఱఁగఁగ నీదుపయ్యెదను ♦ ద్రోయఁగ బుస్సున నూఁగుటారుపా
ము, అవిక విప్ప వాడిమొన ♦ ముక్కులతోఁ జనుజక్కవల్ననుం
గఱవఁగ వచ్చె నంట! యది ♦ కన్గొని భీతిని మేలు కాంచితిన్ 30

చ॥ ఎలమి మఱొక్కమాఱు మన ♦ మిర్వురముం బసివారమై కలం
బలుమరు నాట లాడు నెడ ♦ బాలరో! నీదు నితంబసైకత
స్థలములమీఁది కా సనెడు ♦ సన్ననిపుల్లను నేను గాంచఁగాఁ
గలుగమి నీదుకోడి యెడఁ ♦ గల్గినగుడ్లఁట చుమ్మి నీ చనుల్! 31

ఉ॥ 'తీయనిమోవి తేనె కరు ♦ దెంచెడు నా రనుచీమబారుఁ దా
నో మెలనాగ, దూరమున ♦ నుండఁగనే కని వెన్కకు న్వడిం
బోయెను భీతిచేత బల ♦ ముం గల దయ్యను వేణిసర్ప, ము
ట్టో!' యని మేలుకొంటిని మ ♦ ఱొక్కతఱి న్వినువారు నవ్వఁగన్

ఉ॥ వే ఱొకస్వప్న మందు నిను ♦ వేడుక నేను గవుంగలింప, వే
మాఱును నా శరీరమున ♦ మారుఁడు నాటిన మోహబీజము
ల్తీ అనిచెమ్మటం దడసి ♦ లేచెఁ గసుం బులకాంకురంబులై,
నాఱును బోసి యమ్మరుఁడు ♦ నాటినవాఁ డఁట వానిఁ గ్రమ్మఱన్!

ఉ॥ ఇమ్ముగ నవ్యపాదరస ♦ మెల్లెడ నిండిన నీదుచెక్కుట
ద్దమ్ముల నా మొగమ్మె సుర ♦ తమ్మున నేఁ గని, వేఱె యెవ్వరో
య మ్మొయి నిన్ను ముద్దిడి ర ♦ టంచును బట్టఁగఁ బోవ నీ కపో
లమ్ములె చేతఁ జిక్కెనట! ♦ లజ్జలినా నఁట నీవు నవ్వఁగన్! 34

ఉ॥ 'అక్కట! తాము చక్రవిజ ♦ యంబును బొందిన వంచు నీ చను
ల్నిక్కుచు విఱ్ఱవీఁగుచును ♦ నీల్గుచు నున్నవి, చేతఁ జిక్కిన
న్నొక్కుదు' నన్న 'గోళ్లఁ గద ♦ నొక్కుదు; వాఁడుతనంబు గాని నీ
దొక్కబలంబె?' యంటి వికి ♦ నొక్కకలం గలహంసగామినీ!॥ 35

చ॥ ఉపరతి నీవు న న్గలసి ♦ యొక్కకల న్సలుపంగఁ జూన నా
విపులపువక్ష మందుఁ గడు ♦ వేడుకతో వలరాచబిడ్డఁ డె
ల్లపుడును ద్రిప్పుబొంగరము ♦ లట్టులనే కనుపట్టె నీదు పొం
కపుఁజనుదోయి, జాలెవలెఁ ♦ గన్గొన నయ్యెను నారు మాయురే!॥

శా॥ భామారత్నమ! నీవిఁ కొక్కకలఁ బుం♦భావంబుఁ గావించుచో
నా మైనే నీ జడలోననుండి సుమసం♦తానంబు రాల న్స్మర
జ్యాముక్త ప్రసవాశుగంబు లని నే ♦ నాకంపముం బొందఁగాఁ
బ్రేమ న్నీ చనుడాలులం గరములం ♦ బెట్టంగలేదా కలన్?॥ 37

మ॥ మగలాగి న్నొకస్వప్న మందు నొనరిం♦ప, న్నేను సొంపారఁ బై
కెగయం జేతుల రెంట నీదు చనుదో♦యిం గట్టిగాఁ బట్టఁగా
నగి, 'గోవర్ధనసుందరంబులను శ్రీ♦నాథుండు నేఁ డొక్కసా
రిగ మోసెం గనుఁ!' డంచుఁ బల్కితివి సం♦ప్రీతాత్మవై నాతిరో! 38

మ॥ 'చెలియా! యెన్నియొ యింద్రజాలముల నే♦ర్చె న్నీ చను ల్చందనం
బలఁదంగా హిమవంతము, ల్పసుపు పూ♦య న్మేరువు ల్కుంకుమం
బొలయంగా నుదయంబులు, న్మృగమదం ♦ బొప్పారఁగా నంజనం
బు!'లటన్నం, 'గవిసార్వభౌముఁడ వెయాఁ♦బో,' మ్మంటినన్నుంగలన్

మ॥ పొలయల్కంగలలోన నీ వనలిమో♦ముం గాఁగఁ బన్నుండ, 'నీ
బలుచన్త్రిప్పలు మోముఁదామరయుఁ ద్రి♦ప్ప న్శ్రోణుల న్నైకత
స్థలులుం గొ ప్పనునాఁచు లేవె మఱి? నీ ♦ సౌందర్యగంగాఝరిం
గలదే యీదరి మే ల టన్న?' దని ప♦ల్కం గోపము న్మానవా? 40

చ॥ 'పడఁతిరో! పూవుముల్కులను ♦ బల్మఱు మారుఁడలంత పెట్టఁగా
వడలుచు నిన్నుఁ జేర నను ♦ నద్దిర! నీ బలితంపుగుబ్బలం
బొడుచుచు బాధ పెట్టుటకుఁ ♦ బూనితి, విద్దియె ముల్లుపుచ్చి కొ
ఱ్ఱడచినచంద'! మన్న నగ♦వా? తగవా కలలోన నేని యున్? 41

ఉ॥ చక్కని పెన్దొడ ల్బిగువుఁ ♦ జన్మొగడ ల్మురిపెంపునెన్నడ
ల్గ్రిక్కనఁ గాంచి, స్వప్నములఁ ♦ గంతునిదంతి వటంచు నెంచి, నీ
వ్రక్కఱి నాకు నోడ మరుఁ ♦ డోఁచుటయు న్నామకూడు నంచు నో
చక్కెరబొమ్మ! నిన్నతను ♦ సంగర మందు జయింతు వేమఱున్॥ 42

ఉ॥ నీదు శిరోజనీలముల ♦ నీ యధరాధరపద్మరాగము,
న్నీదు నఖాళివజ్రముల ♦ నేను హరింతు న టన్నఁ గూడ నీ
ల్గా దని కర్కశ స్తనశి ♦ లామయ హా బిగువుంగవుంగిటన్
ఖైదుగ బాహుపాశములఁ ♦ గట్టవె నన్గల లందు సుందరీ?॥ 43

సీ॥ ఘనవేణి! నీ కొప్పు ♦ గగనంబు నం దెల్ల
నున్నది నిండి యం ♦ చొక్కమాఱు;
శశిముఖి! నీ మోము ♦ చంద్రిక ల్వెల్లెన
ల్దిక్కు లం దంచు వే ♦ ఱొక్క మాఱు;
నగకుచ నీ చను ♦ ల్జగతీతలము మోఁ్రియు
చున్నవి యంచు నిం ♦ కొక్కమాఱు;
సుమగాత్రి! నీ మేను ♦ ప్రమదావనుల నెల్ల
నున్నది యంచు మ ♦ ఱొక్కమాఱు;
ఆ॥ వె॥ మఱియు నింకఁ బెక్కు ♦ మాఱులు నీ బలు
తళుకుఁగన్ను లెల్ల ♦ కొలఁకు లందుఁ
జెలఁగు చున్న వంచుఁ ♦ జిత్రంబుగా నేను
గలల యందుఁ గంటిఁ ♦ గలువకంటి॥ 44

సీ॥ తొగతేనిఁ గన నీదు ♦ నగుమొగం బాదిని
గనిపించి కమలము ♦ ల్గానిపించుఁ;
గమలము ల్గన నీదు ♦ కరములు దొలుతను
గనిపించి కిసలము ♦ ల్గానిపించుఁ;
గిసలము ల్గన నీదు ♦ కెమ్మోవి మొదటను
గనిపించి తేనియ ♦ గానిపించుఁ;

దేనియ గన నీను ♦ తీయపల్కులు ముందు
గనిపించి యమృతంబు ♦ గానిపించు;
తే॥ గీ॥ నమృతము గనంగ నీ మంద♦హాసము ప్రథ
మమునఁ గనిపించి తొగఱేఁడు ♦ మఱల నీమొ
గమ్మఁ గనిపించు; నీ రీతిఁ ♦ గలలలోన
నెటులఁ జూచినఁ గనిపింతు ♦ వీవె నాకు!॥ 45

సీ॥ రంభఁ గూడినభంగి ♦ రాగింతు నీ తొడ
లనురక్తి నిమిరిన ♦ యట్టు లైన;
హేమఁ గూడినలీల ♦ నెంచెద నీ యొడ
లాసక్తి స్పృశియించి ♦ నట్టు లైనఁ;
దారఁ గూడినరీతిఁ ♦ దలఁతును నీ గోళ్ల
నర్థితో ముద్దిడి ♦ నట్టు లైన;
హరిణిఁ గూడినమాడ్కి ♦ ననుకొందు నీ చూపు
లనురాగమునఁ జూచి♦నట్టు లైన;
తే॥ గీ॥ స్వప్నముల యందుఁ గాన న♦చ్చరలపొందు
టంచు నీ పొందు నేను భా♦వించు చుందుఁ;
గానిచో నీకు నప్సరః♦కామినులకు
'హస్తిమశకాంతరమ్మ' సు♦మా సుమాంగి!॥ 46

సీ॥ కూర్మ బంధంబునఁ ♦ గూడుదు నో శ్యామ!
సింహవిక్రమము నా♦శింతు లేమ!
గజబంధమున రతిఁ ♦ గావింతు మదవతి!
యేణబంధము మతి ♦ నెంతు యువతి!
ధనురాఖ్యబంధంబు ♦ నొనరింతు మరుదంతి!
యర్థచంద్ర మొనర్తు ♦ నందు నింతి!
భ్రమరబంధంబున ♦ రమియింతుఁ గరియాన!
మాయూరమున నుంతు ♦ మనసు చాన!

తే॥గీ॥ కలలలోపల నీదు మీఁ♦గాళ్లఁ, గౌనుఁ,
జన్నుఁగవను, గన్నుఁగవను ♦ గన్ను బొమల,
నెన్నుదురు, ముంగురుల, బలు ♦ పెన్నెఱులను
గాంచి యాబంధముల నీకుఁ ♦ గాంతు ననుచు. 47

చ॥ అబలరో! కామశాస్త్రపుర♦హస్యము లెల్ల నెఱుంగువారిలోఁ
బ్రబలుఁడ నంచు నెంచి బహు♦భంగుల న వ్వలతేఁకు గూడఁ బూ
గుబుసుల బూజఁ జేసె నిది♦గో! మఱి నీవును నిస్తుల స్తన
స్తబకయుగంబు నా యురముఁ♦ దాఁకఁగ దండల వేయుమమ్మ మెడన్

నాగపాశబంధము.

చ॥ అమరఁగ భోగిసీమదిత ♦ వైతనుచు న్గడఁ జూడఁ దోఁచు,మా
న్యముగ భుజంగుఁడన్, మదిఁ గ♦నంగ దళం దగినారమే చుమీ!
శ్రమ విడ, నింక నోము నను ♦ జానుగఁ; జె ల్వగునాగపాశబం
ధమున రతుండ నో మహిళ, ♦ తాళనె చు మ్మిఁక నీ భువిం జెలీ

చక్రబంధము.

శా॥ కన్యా! శృంగిసమానబంధురకుచా! ♦ కల్యాణసుశ్రీరమా!
ధన్యా! గానకళాధురంధర! కళా♦తంత్రాసమానాదరా,
జన్యైరమ్మదజైత్ర సుందరకటా♦క్షా, యిద్ది యే ధర్మమా?
మాన్యాత్మా! కడు బాధ గల్గె,నను లే♦మా టన్న రాఁ జూడుమా॥

రసికాభిలాషము.

సమాప్తము.

సెట్టి లక్ష్మీనరసింహ్వ కృత,

# సరస చాటువులు.



తే॥గీ॥ పూర్ణశశిసమమై మోము ♦ పొలిచె నేమొ?
కురుల పేరి మబ్బులు దస ♦ లొఁగనియె నడ్డ;
నాతిమిన్న నాతోడ ని ♦ న్న మగలాగు
కుతుకమున సల్పఁ దానె పై ♦ కొన్న యపుడు॥ ౧

తే॥గీ॥ కను, ప్రియా, తులువయళి యీ ♦ కలువపూ కు
అంగటం గని, యిందు మ ♦ రందమొడ్డ
గిల్ల, నెంతొప్పె నం చుల్ల ♦ సిల్లుచు, నది
గ్రోలి నిదుర పొందెం గుల ♦ కుచు నచటనె॥ ౨

ఉ॥ "ఇంతలు చన్ను లుండ మఱి ♦ యెవ్వరిఁ గూడెదు భాసురాంగి? యే
కాంతమునందు నున్న జవ ♦ రాలఁ; దప్పిం బడి వెన్కతీయు లా
గింతియ గాక, నీ వెఱుఁగ ♦ వే మరుఁ డిచ్చిన దారి చొప్పు? నీ
వింత భయంబుమై నుడుగ ♦ నెల్లిద మౌదువు; మాట లేటికే"

ఉ॥ "నిక్కము, దోఁవ నేల? తరు ♦ ణీకులరత్నమ, యింక నీవయిం
జిక్కె ఘనంబు నీకు: విను, ♦ చిత్తజుదండముఁ జప్పరించెదో?
చొక్క బరాందిమద్యముల ♦ చూఱలఁ బాటిలు వేఁడిచేతఁ బెం
పెక్కఁగఁ జేసి, దాని మరు ♦ నింటను దూఱిచి యాదరించెదో?"॥

సమస్య:- చన్నుల వంకఁ జూపెఁ జల♦జాస్యవిటుండు తొలంగిపోవఁగన్

ఉ॥ "క్రొన్ననవిల్తుకేళిఁ గవ♦గూడఁగ నియ్యెలతోఁటలోనికిన్
నిన్నిపు డేగుదెమ్మనుచు ♦ నేఁ గబు రంపితి; నింత, నా చెలుల్
తిన్నగ నివ్వనంబున క♦దే! చనుదెంచుచు నున్నవా," రటం
చన్నుల వంకఁ జూపె జల♦జాస్య విటుండు తొలంగి పోవఁగన్॥

సమస్య:- యో నిరతంబుఁ జేయు నరుఁ♦డొందఁడు పాపముఁ, బొందు
బుణ్యమున్॥

ఉ॥ మానక 'రామ,రామ,'యని♦మానసమందు శివుండు నిత్యమున్
ధ్యానము చేయుచుండు; నల♦తారకనామముఁ జిత్తమందు శ్రి
ద్ధానియమంబులొప్పఁగను ♦ దాను బునశ్చరణంబు వందొ, వే
యో,నిరతంబుఁ జేయునరుఁ♦డొందఁడు పాపముఁ,బొందుఁబుణ్యమున్

సమస్య:- 'భగమును నీవు పెట్టఁగను♦బొనముచేసినవాడనే'యనెన్॥

చ॥ దగ గొని దుస్ససేనుని యొ♦దం గల నెత్తురు గ్రోలు భీముఁడం
తఁ గురుపతిం గనుంగొనుచుఁ,♦'ద్రావెదనంటిని; ద్రావితిన్; మహో
రగసదృశుండు వీని రుధి♦రం బనిరన్ విషమే; విషంబు దు
ర్భగ! మును నీవు పెట్టఁగను ♦ బొనము చేసినవాఁడనే,'యనెన్॥

సమస్య:- దెంగన్నత్తువ చాల దంచు రమణిం దేర్చెన్ రతిక్రీడలన్॥

శా॥ అంగంబుల్ విటుఁడొయ్యనంగ్రమముగా ♦ నంటంగ రోచేఁడ'నా
భిం గేల్పెట్టెద? వేది యొందొ సరిగా ♦ వీక్షింప లేవే?' యనం
గం, గాంతుండు పకాలు మంచు నగుచుం♦'గన్దోయిచత్వార మొం
దెం; గన్నత్తువ చాల' దంచు రమణిం ♦ దేర్చెన్ రతిక్రీడలన్॥

సమస్య:- రంభ త్రికోణమధ్యమున రత్నము భాసిలె నద్భుతంబుగన్

ఉ॥ జంభవిరోధి కోడిన ని♦శాచరు లాతని పంపునన్ మదిన్
దంభము మాని రంభ మరు♦ధామమునం దల లుంచి మ్రొక్క సం
రంభమునందు నూడి, యొక ♦ రత్నము లోపటఁజిక్కెఁ: నందుచే
రంభ త్రికోణమధ్యమున ♦ రత్నము భాసిలె నద్భుతంబుగన్॥

క॥ ధనకాంక్షను గల గణికా
కనకాంగులతోడఁ జిత్త ♦ కార్తిఁ దిరుగు స్త్రీ
శునకాలను దక్కెడనో,
తునికోలనొ తూఁచ, సరిగఁ ♦ దూఁగఁగ వచ్చున్॥ ౧౦

చ॥ ఖగపతి తెచ్చుచున్నపుడు ♦ కాఱె సుధాలవమే పొగాకుగా
జగతిని బుట్టి పొందెనను ♦ సంగతి సత్యము టంచుఁ దామెఱుం
గఁ గలుగు చుండ్రి గాదె గణి ♦ కామధురోష్ఠసుధారసంబు ద్రా
గఁగ గమకించు నట్టి విట ♦ కాం, డ్రిటఁ బుట్టెడి చుట్ట వాసనన్॥

ఉ॥ విత్తులనుండి చెట్లు ప్రభ ♦ వించుట యున్నది గాని, పండ్లె యు
త్పత్తిని బొందు టబ్రము గ ♦ దా? వనమాలిసుతుండు స్త్రీలకున్
హృత్తట మందుఁ జిన్నపుడె ♦ రెండిసుమంతలు విత్తు లుంచఁగాఁ,
గ్రొత్త వయస్సు నాఁటి కవి ♦ రూపగు గుత్తపు దబ్బపండ్లుగా॥

క॥ మదనుఁ డను స్వర్ణకారుఁడు
పదకము చెలి తోడఁ నడుమ ♦ బాగుగ నిడి, యే
యదుకుం బెట్టెనొ? పగిలిన
దది: సీల బిగింపు లింక ♦ నవసర మయ్యెన్॥ ౧౩

చ॥ మొగములుమాసమందునొక ♦ మూఁడుదినంబులుదక్క స్త్రీలకున్
మిగిలిన యట్టి రోజులను ♦ మెచ్చొదవించును వీడ్యపుజ్జిగిన్;
భగములు మూఁడు రోజులనె ♦ పాపము! తద్విధమైన వీడ్యపు
జ్జిగిని ధరించు చుండుఁ; విధి ♦ చేసెను దాదృశపక్షపాతమున్॥ ౧౪

ఉ॥ ఏతఱి మన్మథుండు తన ♦ యింటి పయిన్ నును తేంట్ల కాపుగా
రాతిరియుం బవల్ నిలిపె, ♦ రాగమకించు భుజంగతండమున్
'హా!'తను, 'హాతు!హా!'తనును ♦ 'హా!'తను; నయ్యవి యందు చేతనే
యాఁతులు గాఁగ మాఱెనవి ♦ యాదిహకారము లోపమౌఁ గదా

తే॥గీ॥ మారుఁ డాత్మదండంబును ♦ బూరుషుల ప
రంబు గావించి, నిజమందిరము రమణుల
వశముచేయంగ, నయ్యది ♦ వచ్చి యుండుఁ
జొచ్చు: నలవాటు మాన్పుట ♦ సులభమగునె?॥ ౧౬

ఉ॥ చిత్తము నందు సంభవము ♦ చెందిన మన్మథుఁడందు నిల్వఁగా
నొత్తుడు గల్గెఁ గర్కశప♦యోధరభూధరకర్షణంబునం;
గ్రొత్త నివాస మేర్పఱుచు ♦ కొంటకు నూరుల కేఁగి, యచ్చటన్
బెత్తెఁడు కొంప నుండియును, ♦ బెండు నతండు సమస్తవీర్యమున్॥

తే॥గీ॥ ఊరుల నడుమ మన్మథుఁ ♦ డుండ నిఁడ్లు
కట్టుకొనె; వాని పైఁ దోలు♦కారు శిశ్న
తతి ప్రబలి ద్వారములఁ గప్ప ♦ దండములను
దోలఁగఁ ద్రోయుం డనుచుఁ బురు♦షులను బంపు॥ ౧౭

చ॥ ఘనతరకార్యముల్ సలుపఁ ♦ గల్గఁ, బ్రియోజకు లైనవారికిన్
వెనుక సహాయు లుందురు క♦సీస మొకిర్వురె యేని; బ్రహ్మదే
వుని గతి సృష్టి సల్పుటకుఁ ♦ బూనిన శిశ్నము వెన్కనండముల్
దనరుటఁ గాదె యీ పనిని ♦ దా నొనరింపఁగ నేర్చుఁ జక్కఁగన్

మ॥ నెలకున్ ముప్పది జీతముం గొనుచు నెం♦తే స్వేచ్ఛగా నున్న వే
శ్యల బియ్యాలఁ, దదర్థజీవితములం ♦ దాక్టింగులం జేసి శు
ష్కలు బియ్యేల్ గని మ్రొక్కుకాల మరుదెం♦చెంగాదె? యాకారమే
విలువం దెచ్చు నటంచు మాఱుఁ డిపుడో♦బియ్యేలు! బియ్యాలుగా

[బియ్యా(ఓఢ్రమున)- భగము: బియ్యే (B· A·): ఆక్టింగు (**Acting**) ఖాయము కానిది: ఆకారము — ఆ యన్నయక్షరము; రూపము]

ఉ॥ లోహములం గడాని, యిహ♦లోకపు గింజలలో బటాని, జి
హ్వాహితదాయకాఖిలప♦దార్థచయంబునఁ జీనియర్, జగ
న్మోహినులందు సాని, కవి♦పుంగవు లందు శతావధాని, స్త్రీ
దేహమునందు యోనియు బ్ర♦తిష్ఠను గాంచెను శ్రేష్ఠతన్ భువిన్॥

క॥ జాకెట్టునఁ గల వాచీ
పాకెట్టునఁ జేయి పెట్టి, ♦ "పడతీ, వాచీ
లే కిట్టులు టిక్కిక్కులు
నీ కెట్టులు కలిగె?" నంచు ♦ నెయ్యం డడిగెన్॥ ౨౨

(జాకెట్టు (**Jacket**) స్త్రీలుతొడుగుకొనుజుబ్బా; పాకెట్టు (**Pocket**) జేబు: వాచీ (**Watch**) జేబుగడియారము)

ఉ॥ స్త్రీల చనుల్ మితంబు లయి ♦ ప్రీతిని గొల్పును; బట్ట రాని బాం
డా లయినన్ పిటుల్ నిరస♦నంబొనరింతురు వానినిన్: టెనిస్
బాలును జేతఁ బట్టుకొని ♦ బాలకు లాడుదు; రట్లు గాక ఫుట్
బాలును గాళ్లఁ దన్నఁగఁ గ♦డంగుదు, రెందఱు గల్గ నందఱున్॥

బాలు (**Ball**) బంతి: టెనిస్ (**Tennis**) ఫుట్ (**Foot**) కాలు.

ఉ॥ కాముఁడు కట్టువాండ్ర చెలి♦కాఁడెయగున్: మగవారిఁ బ్రేమతోఁ
గోమలు లారయన్, రవిక♦కట్లు పుటుక్కనిపించు; నట్టు లే
భామల వంకఁ బూరుషులు♦ భ్రాంతి మెయిం గను లెత్తి చూడఁ, బెం
ట్లాముల యున్న బట్టనులు ♦ టప్పనిపించును జప్పుచప్పనన్॥

(పెంట్లాము – (**Pantaloom**) షరాయి: బట్టను - (**Batton**) గుండీ.)

ఉ॥ దొరలటు నున్నగా, సుళువు♦దోఁపఁగ, మీసము గడ్డముల్ మహా
త్వరగను షేవు చేసికొను ♦ భర్తలఁ గన్గొని భార్య, "లక్కటా!
హరిదళ మంచు; బూడిద య ♦ టంచును, మాకిఁక నేల? మీదు రే
జరులను దెండి," యందురు, హా♦సన్ముఖులౌచును వారు పొండనన్

(షేవు (**Shave**) క్షవరము; రేజరు (**Razor;**) మంగలికత్తి)

చ॥ క్షుతరము కాంచెదుర్ సివిలు • సర్వీసులోనఁ బ్రవేశ మైన వా
రి వదనముల్; భువిన్ మిలట•రీ పని వారికి మీస లెప్పుడుం
దవిలియె యుండు సూనశర•దారుణసంగర మందు నుండు న
ట్టివి గనుకన్, భగంబులకు • తీకుగ మీసము లుండు చెంపలన్

(సివిలు సర్వీసు - (**Civil Service**) యుద్ధసంబంధము కాని కొలువు: మిలటరీః- (**Military**) యుద్ధసంబంధమైనకొలువు.

శా॥ చెల్వన్ షాపున బట్టకై చెలియ వాంఛి•ంపన్, "సతీ,పూర్వపున్
వల్వా కావలెనె?"నంచు భర్త తను సం•ప్రశ్నించె; నింగ్లీషునం
దెల్విం గల్గిన భార్య, "పూర్వపుది కా•దేన్, గ్రొత్తదిన్ దెచ్చినా?
మొల్వం బోలుచు మీకు పీనిసులు తే•పున్ మాపు నంచున్ నగెన్॥

(షాపుఁ (**Shop**;) దుకాణము: వల్వా (**Vulva**;) యోని: పీనిసు (**Penis**; శిశ్నము: పూర్వపున్ వల్వాకావలెన్ - వెనుకటి (రకపు) బట్టయా కావలయునని భర్త యడిగెను; పూర్వపు యోని కావలయునని భర్త యడిగినట్లు; ఇంగ్లీషు చదువుకొన్న భార్య యొక యర్థముతీసి, యెకసక్కెము చేసినది. )

చ॥ కవితను నేర్చుకొన్న గణి•కం గనుచున్ రసికుండు, "చెప్పు మొ
క్క విషయమున్ మొగంబున భ•గంబును గల్గిన దెద్ది?" యన్న న
య్యువతి యెఱుంగదయ్యె; నతఁ•డుత్పల పద్యముఖాక్షరాళి నా
ల్గవదియుఁ జేర్చినన్ భగము•గాదె గణం?" బని పల్కె నవ్వుచున్॥

ఉ॥ ఆడఁగ బొంగరాలు గల•వంచును బిల్చుచు లోనికిం బదా
ఱేఁడుల మేనయల్లుఁ గొని • యేగి, యటం జనుబొంగరా లెదం
గాఁడెడు నట్లు మోపి, గసి•కన్ మఱి దింపఁ గదోయి" యంచునుం
గూడెను వానితోడ నొక • గుబ్బెత నేర్పుల నెల్ల నేర్పుచున్॥

ఉ॥ ముప్పదియేండ్లు నాకుఁ; బదు•మూఁడవ యేఁడుది మాదు చెల్లి; మే
మిప్పగిఁ బూటకూళ్ళ నుతి•కెక్కిన వారము; దబ్బకాయయో,

చెప్పెడు, నిమ్మకాయ యొ, తమ ♦ చిత్తము వచ్చినసుండు; రాత్రికిం
దప్పక రండి డనుచున్ నవని ♦ తంతు వ్యోకర్తృక బాటసారులన్‖

ఉ‖ పంటల బాఁపనక్క కడు ♦ వంగుచు వడ్డన చేయ విస్తటం
జంటిమొనల్ పడెం; బడినఁ, ♦ "జాలును; మాఁడినయీపడెంబులన్
రెంటిని రెండు ప్రక్కల న ♦ రే! యిటు వేసితి రే!" యటం చనెం
గొంటెతనంబుగాఁగ నొక ♦ కుఱ్ఱఁడు, ప్రక్కకుఁ గన్ను గీటుచున్‖

ఉ‖ "ఆమ్మన నాటి పేఁపునకు ♦ రోసతి చన్నులు దూసెనో" యనెం
దిమ్మకవీంద్రుఁ: డోసుదవ ♦ తీ, పరమాద్భుత మొప్ప నీ యురో
జమ్ములు ఆమ్మ చుట్టునను ♦ సాఁగుచు, పేఁపుశ నిట్టటుల్ సమా
నమ్ముగఁ బ్రాఁకుచుం, జనుమొ ♦ నల్ వెనుప్రాసను డీకొనెం గదే‖

ఉ‖ తగ్గక క్రింద నుండి సరి ♦ తాఁకులుగా నెదురొత్తు లొత్తియున్,
బిగ్గఁ గవుంగిలించియు, న ♦ భీష్టము తీఱక మిండగానిఁ దా
దిగ్గునఁ ద్రోసి, సైకొని, ర ♦ తిన్ సివ మెత్తిన బాలరండకున్
విగ్గెడలంగ గుండపుడు ♦ వెల్వడె నూరు ఫిరంగి గుండటుల్‖

(విగ్గు (Wig) అఁడువేషము వేయునప్పుడు వేసికొను తల
వెండ్రుకలతోడి టోపీ.)

ఉ‖ "పూర్వసువాసినీ, భగము ♦ పుష్కలరోమమయంబు నీకు; నా
శర్వుని లింగ మట్లుగ నె ♦ సంగెను నీదు శిరంబు; సంతతం
బర్వున నేగి వాఁడి గల ♦ మంగలికత్తిని దెమ్ము; దానితో
సర్వముఁ జక్కఁజే: నిచటి ♦ శష్పము లచ్చటఁ బెట్టుటే కదా?"

చ‖ కనుఁగవ యంట చెల్ల, దలి ♦ కంబునఁ గన్ గల శంభుఁజెప్పెడోఁ;
జనుఁగవ యంట యీ విధవ ♦ చానయెడన్ సరిపోవ; దామె ను
న్నని శిరమే రతిన్ విటజ ♦ నంబుల చేతుల నుండుఁ జన్నటుల్:
స్తనములఁబాగళ స్తన ని ♦ ఘంబును బొందిన వామె కందుచే‖    ౩౫

ఉ॥ ముట్టుతతోడఁ గూడి, మెల♦పొద్దున నింటికి సందుగొందులన్
గుట్టుగఁ బోవు నట్టి యనుఁ♦గుం జెలికానినొకండుగాంచి, 'పెన్
జెట్టికి నై నటుల్ రుధిర♦సిక్తములైనవి నీదు వస్త్రముల్;
గట్టిగ మారసంగరము ♦ కల్గినదా?' యని నవ్వె బిగ్గరన్॥ 36

చ॥ "ఔలఁదిరో, రంభ కన్న, విరి♦విల్తుని పొల్తుక కన్న వన్నెచి
న్నెలు గల యన్నుమిన్న వని ♦ నిన్ విషయింతు న టన్న, నీ భగ
స్థల మెటు పుచ్చియున్నదొ గ♦దా యని జంకుదు?నీ మొగంబునం
దొలసెడు నంత నున్నఁదన ♦ మున్నదె చెప్పుమ నీ భగంబునన్॥

మ॥ శివదీక్షాపరురాలు జంగ మది తా ♦ శ్రీవైష్ణవస్వాములం
గవ గూడంగఁ దొడంగె వారలకు లిం♦గా లుండుటం జేసి; వై
ష్ణవులున్ దాని స్తనద్వయంబుఁ గనుచుం♦'జక్రాంకితంబయ్యె; నిం
క వృథా శంక య దేల?'యంచుఁ గలియం♦గా సాగి రక్కాంతతో॥

ఉ॥ అంగజకేళిఁ గోరి యొక ♦ యన్యవధూమణి శయ్యఁ జేరఁ, జ
న్నుంగవఁ బట్టుచుం; బెదవి ♦ నొక్కుచు ముక్కువతో, విటుండు నీ
విం గడ కొత్తి; రోమచయ♦విస్తృతయోనిని గాంచి నంతనే
మంగలివాని యంగనయె ♦ మంచి దటంచుఁ దలంచె నాత్మలో॥

ఉ॥ జామి ఫలంబు గోయ వెల♦చాన యొకర్తుక చెట్టు నెక్కఁగా,
భూమి విటుండు నిల్వఁబడి, ♦ 'బోటిరొ, జామిని రావియాకు నా
కి మెయిఁ గానిపించె,' నన ♦ నింతియు గాగర కచ్చపోసి, 'ఛో,
నీ మొగ!' మంచుఁ బల్కెఁదన♦ నెచ్చెలు లెల్లఁ బకాపకన్నగన్॥

ఉ॥ 'కొండలు సంచలించె; నిది♦గో! గగనంబు వడంకె నంచునున్
దండిగ నున్న యట్టి వృష♦ణంబుల వాఁడు రతంబు నందుఁ బై
నుండిన భామ చన్కవును♦లూఁగుచు నుండుటఁ గాంచి పల్క, 'బ్ర
హ్మాండము లల్లలాడు రతి ♦ యిప్పుడు నీ,'కనె నామె నవ్వుచున్

ఉ॥ చన్నులు తేని యట్టి వెల♦చానను మిండఁడు, "గుండె నీకు నా
కున్నదె యున్నదో నెలఁత!♦ యోని కడన్ మఱి యెట్టులున్నదో?"
యన్నను, "నీదుమూతి యటు ♦ లయ్యది పూర్తిగనుండు, నమ్ముమా:
కన్నము కద్దు; మీసమును ♦ గ" ద్దని నవ్వెను వేశ్య పక్కునన్॥

ఉ॥ "పాకొక కొమ్ము పెట్టినను♦ భామిని యయ్యది పూ యగుంగదా?
పూకును దీర్ఘముం గలుపఁ ♦ బోవగ నేమగు?" నన్న జారుతో
"లోకులు వ్యర్థమందురి) రతి♦లోఁ దెగబారెఁడు దీర్ఘ మైనదే;
నీ కటువంటి దున్నదె? య♦నెన్ వెలజవ్వని బిగ్గ నవ్వుచున్॥ ౪౩

ఉ॥ ముద్దులసానిచెల్లి మొగ♦ముం గని కవ్వుచు మిండగాఁడు 'నీ
యద్దముఁ దెచ్చి చూపఁ గదె' ♦ యన్నఁ దదగ్రజ 'యద్ది కొద్దిగా
బ్రిద్దలు వేసె నోప్రియ! భ♦వన్ముఖమందుఁ గొనంగ, నీ
కిద్దఱి మోము లున్న యటు♦లే కన నౌ నని నవ్వెఁ గెవ్వనన్॥ ౪౪

ఉ॥ చందురు నీమొగంబునకు ♦ సాటిగఁ బల్కెడి వారు దానిలోఁ
గందును గాంచ లేదొ? గణి♦కామణి, నీదు భగంబు సాటి నీ
యం దగు, నంచు జారుఁ డన ♦ నచ్చెలి, యందలి సార మెల్ల నీ
కుం దెలియంగ నౌ; నగు న♦గున్ విబుధుండ వనెన్ స్మితంబుతోఁ॥ ౪౫

ఉ॥ 'రాజులఁ జూచితిన్! రసిక♦రాజిని జూచితిఁ! గాని సెట్టిగా
రూ! జగ మందు మిమ్ము నెవ♦రున్ సరిపోలరు మీరలే బృహ
ద్బీజము పేరి బొండ్లమును ♦ బెట్టి భగంబునకున్ భయంబునం
బూజ యొనర్తు,' రంచు వెల♦బోటి వచించెను వృద్ధవైశ్యుతోఁ॥ ౪౬

ఉ॥ బచ్చొకఁ డొక్క తోపడఁతిఁ♦ బ్రాపకమున్ మునుచేసి, ప్రేమతో
నిచ్చె సమూల మైన తన ♦ యెల్లధనంబుఁ; బడంతి వానికిం
బచ్చుసెగం దగిల్చె; నల ♦ బచ్చు, "మొదల్ చెడి మొడ్డచేతికిన్
వచ్చె," న టంచు నేడ్చు సెగ♦బాధకుఁ గచ్చనుజేయి దూర్చుచున్॥

ఉ॥ "నాయది నాకు; మప్పదియు నాకును; చెల్లిదినాకు," మన్నఁ, గ
న్దోయిని నెత్తిచేసె వెల తొయ్యలిపై సరసుండు; "తల్లి ము
న్నీయిలు మాకు ముత్ప్వరకు నిచ్చెను; నాదె యనంగఁ బోకు మో
నాయక! యంటి," వంచు వెల నాతి నిరుత్తరుఁ జేసె నాతనిన్॥

క॥ "పనసతొన నుండి తొలఁగిం
చిన దానవె చెలియ, నల్ల చీమల నెల్లం?
"జనుదెంచు నేమొ మగుడఁగ,
ననంటిపం డీవు పెట్ట నటవిటకాఁడా"॥ ౨౯

మ॥ తలక్రిందై తప మాచరించుచును గాం తారత్నమా, నా కడం
గలఁ డత్యద్భుతరూపుఁ; డాతని వి వి క్త్రం బా స్థలిం బెట్టఁగా
వలయున్; నీ కడ నున్న కొండగుహ నీ వా?" యంచుఁ బణ్యాంగనం
దిలకించెన్ విటుఁ; డామె, "మాని నడనెత్తిన్ నోరుకద్దా?" యనెన్

స ర స చా టు వు లు

సంపూర్ణము.



# పూర్వకవుల

# చాటువులు.



ఉ॥ చేతికివచ్చువస్తు వెడఁ ♦ జేసితి, వాప్తులుశత్రులైరి, యే
రీతిని నైనఁ గార్యమొన♦రించెద నన్ను నొనర్ప నీవు, నీ
చేతికి సాగి నంత పనిఁ ♦ జేసితి వింతియెకాని, యింక నా
యాతొరకైనఁ బీకఁగల♦వా? గ్రహచారమ! దుర్విచారమా॥

ఉ॥ కూటమినొక్కనాఁటికి త్రి♦కోణసహస్రములన్ బెకల్చు నీ
ఘాటిక ముజ్జగంబులును ♦ దట్టకమబ్బులు మంచుకొండలున్
సాటిక నిల్వఁగాఁ గలవె, ♦ చాలు శ్రమింపుమి జృంభణంబు, నీ
వేటికె లేవఁ బూనితివి? ♦ యీ నడిజామున నోప్రజాపతీ॥ ౨

క॥ ఆ కాంతామణి యుపరతి
కాకాశము వణకెఁ దార ♦ లల్లల నాడెన్
జోకై నగిరులు కదలెను
భీకరముగఁ దమము చంద్ర♦బింబం బంటెన్॥ 3

క॥ సుదతీ! నీ కుచగిరు లిటు
కదసి వడిన్ గూలి నట్టి ♦ కారణ మేమే
చెదరి గిరులైనఁ గూలవె
కదసి వడిన్ గ్రిందఁ ద్రివ్వఁ♦గా! చెలువుండా॥ ౪

క॥ పట్టితి రెండుకుచంబులు
పెట్టితి మఱి తొడలసందు ♦ పెటపెట లాడన్
పట్టులు గంతులు వేయఁగ
గట్టిగఁ గొట్టితిని జుల్లి ♦ కందఁగ మిగులన్॥ ౫

ఉ॥ ఊరులు బట్టి రా దిగిచి ♦ యున్నత మైన కుచద్వయంబుపై
చీరె తొలంగఁ దీసి సతిఁ ♦ జేకొని బిగ్గనఁ గౌగిలించి తాఁ
గోరినకోర్కె దీర్చుకొని ♦ కోమలి పొందక యున్న యట్టి యీ
సారును దెల్పుఁడీ సురత♦సౌఖ్యము జెందిన జాణ లందఱున్॥ ౬

ఉ॥ ఆ కనకాంగి వంగికొని ♦ హంసలరీతిని ము గ్గొనర్పఁగా
వాకిట నున్నయొక్క విట♦వర్యుఁడు గాంచి తదీయయోనిపై
కోకఁ దొలంగఁ దీసిసతిఁ ♦ గూడి హుటాహుటి దెంచుచుండఁగా
తాకెఫిరంగిగుండు వలె ♦ దడ్డు లతాంగికి బొడ్డుకిందికిన్॥ ౭

ఉ॥ అంగన లెంద ఱైనఁగల♦యందఁపుపూఁకులు గల్గువారె నీ
కుంగలనైనఁగాని సరి♦గూడినజాణలు లే రటంచు నిన్
దెంగినవారు దెల్పి రది ♦ తెల్లము శిశ్నము గల్గినందుకున్
దెంగిన నిన్ను దొంగవలె ♦ దెం పలరంగను నీలవేణిరో॥ ౮

తే॥ గీ॥ పిన్నవయసుది పైనెక్కి ♦ పెదవినొక్కి
యల్లతాపునఁ జెయివేసి ♦ మెల్లదీసి
మదనమందిరమునను దా ♦ నదుముకొనియు
వత్తివలె నున్న ముదిమికి ♦ మొత్తుకొనియె॥ ౯

ఉ॥ కోరిక లుప్పతిల్ల మదిఁ ♦ గోరిన యట్టి కళావిశేషముల్
చారుతరంబులన్ రతుల ♦ నల్పఁగ నేర్చిన యట్టిజాణ యీ
వారవధూశిరోమణిని ♦ పంతులు వేసుక దెబ్బతీయుఁడీ
మీరును మీరు మీరు మఱి ♦ మీరును మీరును మీరలందఱున్

తే॥ గీ॥ పన్నగం బాడ నక్షత్ర♦పంక్తి వీడ
గగన మల్లాడ కులగిరు ♦ ల్గలసి యాడ
చంద్రమండలమున జల ♦ స్రావ మొదవ
నుపరతి యొనర్చె నప్పుడ♦ యుత్పలాక్షి॥ ౧౧

ఉ॥ మావును రేపు దీని కొక ♦ మైథున మెక్కడ దెత్తు, దీని యు
ద్ధావనశక్తి మానదు పరి ♦ తాపము సల్లదు ముండమోపులన్
జూపు మటన్న మాపిటికిఁ ♦ జూపెద నన్ను నెయార్చి నిల్వ దీ
పాపపుమేఢ్రదండ మొక ♦ పట్టున శాంతిని బొంద దీశ్వరా॥ ౧౨

క॥ ఇంగిత మెఱుఁగని తొత్తును
దెంగిన సఖకీర్తి వచ్చు ♦ దేహము నొచ్చున్
పింగుకు వడిశము పట్టును
గంగాధర దానిపూకు ♦ గాడ్దెలు దెంగా॥ ౧౩

ఉ॥ జంగమురాలి బట్టి నొక ♦ జంగము వంగగఁ బెట్టి యోనిలో
లింగము బెట్టి త్రొక్కి యద ♦ లించుచు నొక్కొక తాకు తాకినన్
తింగ నమశ్శివాయ గురు ♦ లింగ మహేశ్వర జంగమయ్య యో
యంగజభంగ సాంబ గురుఁ ♦ డా యను దాకిన తాకుతాకుకున్॥

ఉ॥ నీతి యొకింత లేక ధర ♦ నేస్థలి నెవ్వఁడు ద్రోహిలేఁ డనే
హేతువు నూని, నమ్మి, చెడి, ♦ హీనత నొందిన నాకు నేనె యూ
చేతన ముండగా నిపుడె ♦ సిగ్గున గుద్దయు నోరు మూయ నీ
చేతులు రెండు నాకు దయ ♦ చేసిన దేవుని సన్నుతించెదన్॥

ఉ॥ కౌఁగలకార్యముం జెరుపఁ ♦ గా యువనీశులు కొంద ఱన్ని యో
వాగి యబద్ధములు వ్రాలికి ♦ భంగమొనర్పఁ దలంచు చుందు రా
బాగును మాన్పఁజాలరు స్వ ♦ భావము వెల్లడి యౌను గాని సం
భోగపువేళ నక్కుపచు ♦ సోమరిశిష్యము లద్దుపోలికన్॥ ౧౬

శృంగార పంచకము.

సంపూర్ణము.

కామ గ్రంథమాల:— ౧ వ గ్రంథము.

ఆంధ్రులెల్లరు నెన్నివత్సరములనుండియో గాంచ నాతురత జెందుచుండిన రతిశాస్త్రమగు

# రతిరహస్యము.

లేక

# కొక్కోకము

అను

# కళాశాస్త్రము.

ఏనూరు వేయిసంవత్సరముల క్రిందటనే కొక్కోకుండను మహాకవి సంస్కృతమున రతిరహస్యమును రచించెను. దానిని భారతములో నారణ్య పర్వశేషమును రచించిన యెఱ్ఱాప్రగడకు సమకాలికుండగు యెఱ్ఱన తెనిగించి "కొక్కోకము కళాశాస్త్రము" అని పేరుపెట్టెను. కొక్కోకుని శ్లోకమును యెఱ్ఱన తెనుఁగు పద్యములును, వాటికి తాత్పర్యమును గ్రంథాంతము వఱకునుగూర్చి యెఱ్ఱన తెనిగింపని శ్లోకములకు తాత్పర్యము మాత్రమే వ్రాయించియుంటిమి. తెనుఁగుభాషలో నిట్టి సంపూర్ణ గ్రంథ మింతవఱకుఁ బ్రకటింపఁ బడియుండలేదు. ఆంధ్రదేశమున ననేక వ్రాతప్రతులను సంపాదించి పూర్తిచేయఁబడిన సంపూర్ణ గ్రంథమనియు, బంధముల బొమ్మలు కలిగిన గ్రంథ మిదియొక్కటే ననియు తెలిసికొందురుగాక!

గ్రంథకర్తలు
కొక్కోకుండను, [illegible]

పోష్టు ఖర్చులు సహా రూ॥ రు 12—0—0

కామగ్రంథమాల:— ౩ వ గ్రంథము.

# కాళిదాసప్రహసనమ్.

ఆంధ్రానువాదము.

# లంబోదరప్రహసనము.

సంస్కృతమున మహాకవి కాళిదాసవిరచిత మగు ప్రహసన మొకవైపునను హాస్యకళానిధిచే నాంధ్రీకరింపఁబడిన యాంధ్రానువాదం బగు లంబోదరప్రహసన మొకవైపునను ముద్రింపఁ బడిన హాస్యరస ప్రహసనరాజము.

మచ్చునకుఁ గొంత భాగము. ( సంస్కృతము. )

కా:— (సక్రోధం) కిం తవ గృహిణ్యా మన్యగామిన్యా మపి భవతి విశ్వాసః?
లం:— కథ మియ మన్యగామి నీతి జానాసి?
కా:— బహూని చిహ్నాని సంతి. శృణు తావ దిద మేకమ్,

శ్లో॥ భార్యాం కశ్చింమాం ప్రతార్య యభతీత్యాశంకమానేమయి
ప్రాప్తే జాతు గృహాంతరం నిశి మృషా విప్రోష్య సా జానతీ,
లీనా క్వాపి నియమ్య దీప మథ తామన్విష్యతో మేకరే
లగ్నో దీర్ఘ పృథు ర్ముఖసుతరసః కస్యాపి కామధ్వజః.

లం:— (విహస్య) కిం త్వయా కరలగ్న స్స ఏవ సముత్పాటితః?

—• ఆంధ్రానువాదము •—

కాస:— (కోపముతో) నీ భార్య మఱియొకనిచే విషయింపించుకొనుచున్నదని తెలిసిన నీవు దానిపై నెట్లుండుదును?
లంబు:— అటు లైన నీ భార్య నెవం డైన విషయించుట నీకుఁ దెలిసినదా ?
కాస:— అబ్బో! ధర్మసత్రము. ఒకటియన నేల ? అనేక నిదర్శనము లున్నవి. ఇది యొకగాథ వినుము.

మ॥ ననుఁ గన్గప్పి మదీయభార్య నొకఁడన్యాయంబుగాఁ దెంగునం
చనుమానించి మృషాప్రయాణికుఁడనై యా రాత్రి కేవచ్చి యిం
టను జేరంగని దీపమార్పెనది; యొండం దాఁగెనో చూడఁజే
తిని దాఁకెఁ గొవ తేమగల్గి పృథులాదీర్ఘంబునౌ మొడ్డట్ల!

లంబు:— బాగు! చేతికి దొరకగనే శిశ్నము నూడబెఱికి పారవైచితివా ?

చందాదారులకు పోష్టు ఖర్చులతోనహా] [వెల రు. 1-4-0



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B117 |
| పుస్తకం పేరు | శృంగార పంచకము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV,2,24,66 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసేవది | akshaya |
| పేజీలు విడదీసేవది | Thash |
| స్కాన్ చేసేవది | ch. Ramya |
| పరీక్ష చేసేవది | KASIMBI |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |